

# నేతబిడ్డ



రచయిత: పడాల రామారావు.

"నే నెన్నో విషాదాంత నాటకాలుచూచా. అవి చాలామట్టుకు నైరాశ్యానికి త్రోవదీసాయి. ఇది అలాకాదు. పొంగిపొరలే దుఃఖంలోంచి మహోన్నత ఆవేశ తరంగాలను. ప్రేక్షకుల్లో లేవగలిగింది. అయితే ఇంతటిశక్తి ఆ కలాని కెలావచ్చింది? పేదల హృదయాలే కవి హృదయం. రచయిత—తన రక్తాన్ని స్వేదాన్ని ధారబోసి చేనేతకార్మికుల్లో పనిచేసాడు. వారి హృదయాల్లో నీటిలో చేపలా యీదాడు. ఆ ఒక్క ఆచరణానుభవంతోనే వూరుకో లేదు. మా కడలూరు డిటెన్షన్ క్యాంపులో నిద్రాహారాలు లేకుండా. డబ్బులేక కృంగి పోతున్నా, ఎన్నో గ్రంధాలుకొని చదివేవాడు. తీరని సారస్వతతృష్ణతో అధ్యయనం చేసాడు. అందుకే యీ యువరచయిత కలానికింత శక్తి వచ్చింది...."

జొన్నలగడ్డ రామలింగయ్య.

ది 30—6—51.



# నేతబిడ్డ

(ఏడంకాల సాంఘికనాటకం)

రచన:

డాల రామారావు



ప్రచురణ 2.

ప్రజాసాహితి.

జాంపేట : రాజమండ్రి.



వెల రు 1/-

# అంకితం

నా నేస్తం - కస్తూరి కుటుంబరావుకు.

నిన్నా కరకు తుపాకిగుండు ఏ లోకానికి ఎత్తుకుపోయిందో - ఈ లోకంలోమాత్రం నీ కీర్తి కస్తూరిలా వ్యాపించింది. పేద చేనేతకార్మికుల పెన్నిధివై నిలిచావ్! పు త్తరాన ధృవతారవై మాకు నిత్యమూ కొాగడాపట్టి మార్గం చూపుతున్నావ్! "ఒక వీరుడు మరణి స్తే వేలకొలది ప్రభవింతురు!" అన్నాడోకవి. ప్రభవించారు.... నీ ఆత్మకు శాంతి చేకూ ర్చారు, నేస్తం! అంతేకాదు, నీ శాశ్వతవియోగంతో అనాధులై క్రుంగుతున్న నీ భార్యాబిడ్డల వుసురు వాళ్లకు తగులుతుంది. అందులోనూ "కలకంఠి కంటినీరొలికిన...." అది స్పిరిటై మండుతుంది. దావానలంలా దహించేస్తుంది.... ఇదిగో! నేస్తం! నా బరువైన హృదయం, అశ్రుధారతో నీ కంకిత మిస్తోంది "నేత బిడ్డ".

# నమస్సులు.

ఇది నా ద్వితీయ దృశ్య కావ్యపుష్పం. నా తొలిపుష్పం "సందేశం" మీకందిస్తూ చెప్పుకున్నా—"ఇది నా అనుభవ అక్షయతూణీరంలోని ఓ తూపు" అని. ఇది రెండోతూపు అనుకోండి.

నా "సందేశం" శాంతికోసం పడ్డ నా ఆవేదన. యీ నా "నేతబిడ్డ" ఆకలితో ఆక్రందించిన నా ప్రేగుల ప్రోగు; ఆ వేశంతో కొట్టుకున్న నా గుండె—అంతే.

"సందేశం" మీ అమితాదరాన్ని పొందింది. యీ నా "నేతబిడ్డ" మీ వొడిలో ముద్దుబిడ్డై శుభాశీస్సులు పొందుతుందని ఆశిస్తా. నాటక రచనలోనూ, ప్రదర్శనల్లోనూ నిమగ్నుడైన్నా కొట్టుకువచ్చినా, రాకపోయినా, నాపై వుదారత చూపిన వర్తకులు శ్రీ శీలం సోదరులకు సర్వదా కృతజ్ఞుడ్ని. నా నాటక ప్రచురణలో అన్నివిధాలా సహాయంచేసిన, ప్రెస్ కార్మికులకు, అవంతీ ప్రెస్ యజమానులకు నా నమస్సులు.

రాజమండ్రి,
20—7—51.

నమస్తే
పడాల రామారావు.

# కృతజ్ఞత

ఈ నా రెండో నాటకాన్ని రాజమండ్రిలో రెండుసార్లు ప్రదర్శించి, కష్టజీవుల, మేధావుల, కళాకారుల నుండి ఖ్యాతిని గడించిపెట్టిన "పీపుల్సు ఎకాడమీ" (రాజమండ్రి) వారికి.

## నటీనటవర్గం.

| | | |
|---|---|---|
| డాలయ్య | — | శ్రీ మాపూరి సుబ్రహ్మణ్యం. |
| కమల | — | కుమారి కోకిల, క్రిష్ణవేణి. |
| రాముడు | — | శ్రీ ఎ. వి. స్వామి. |
| జగన్నాధరావు | — | శ్రీ పడాల రామారావు (రచయిత) |
| పోతురాజు | — | శ్రీ శైలరాజ్ (ఆంధ్రజాగీర్దార్) |
| పోలీస్ | — | శ్రీ బి. రామలింగేశ్వరరావ్. |

డైరక్షన్ :
శ్రీ శైలరాజ్.

మ్యూజిక్ :
శ్రీ చింతా & పార్టీ.



# నేత బిడ్డ

## 1

[జగన్నాధరావు - భూస్వామి, మాష్టరు పీవరు, నూలుడీలరు కూడాను. అది అతని ఖిల్లు - టేబులూ, కుర్చీ, సోఫా, గోడకు గాంధిఫోటో వుంటాయి. జగన్నాధరావువద్ద పనిచేసే కుర్రాడు - రాముడు, తుడుపుగుడ్డతో అరటిపండు వొలుస్తూ ప్రవేశించి, తొక్కపారేసి ఫర్నిచర్ తుడుస్తూ ]

రాము : పోతురాజుగారింకా రాలేదే? (ఆ రూపం గుర్తుకొచ్చి) పోతురాజుగారేం ? ఓ ! మా బాగావుంటారు !

పాట.

అనగనగా - ఒక రాజూ
పేరే - పోతురాజూ
అసత్యమనలే - ఆడడూ
అహింస యతనీ - ఆయుధం
అనెందరెందరో - అంటారూ
చేతల్లో - సందేహామే ॥అ॥
ఒక్కచేతిలో - త్రోలుఫైలూ
మరోదానిలో - ఖా త్రలగోడుగూ

మాటిమాటికి - మీసందువ్వీ
నేనే మగోడి - నంటాడు,
పేరే - పోతురాజూ ॥అ॥

కాలికి పై రుజోడూ
కంటికి కళ్ళజోడూ
మోకాళ్ళకు - దిగజారూ
లాల్చీ - ధరిస్తాడూ
నెత్తిన టోపీ - పెడతాడూ
పేరే - పోతురాజూ ॥అ॥

[పోతురాజు రాకకనిపెట్టి, రాముడు "తనపాట పోతురాజు విన్నాడేమో" నన్న కంగారుతో ఏమీ తెలియనట్టుగా ఫర్నిచర్ తుడవడంలో నిమగ్నుడై పోతాడు]

పోతు : (గొడుగు ముడవకుండానే, బయటనుండే ఎవరిమీదో కేకలు వేసుకుంటూ ప్రవేశిస్తూ) వెధవలు! చిటికెలో చిత్తైపోయారు. హే! (మీసాలు త్రిప్పుతూ) పాతికేండ్ల సర్వీసు మనది. మనం తల్చుకుంటె నల్లరాయి బద్దలు కావాల్సిందే! (ప్రవేశించి, గొడుగు ముడి చేస్తాడు).

రాము : (వ్యంగ్యంగా సాగదీస్తూ) ఎవడండి వాడూ?

పోతు : (రాముడ్ని ఎగా, దిగా చూస్తూ) అడిగింది నువ్వా? (అరటితొక్కపై అడుగేస్తూ) ఏడిశావులే! (జారి పడతాడు.)

రాము: (విరగబడి నవ్వుతూ, లేవనెత్తుతూ) అరె! దీని తస్సాదియ్యా! యీ వెధవ అరటితొక్క మిమ్మల్ని పడగొట్టేస్తుందా?

పోతు: (లేస్తూ) ఓరి వెధవా? (కొట్టడానికి గొడుగెత్తుతూ) నీవు చేసిందేనా? ఇది?

రాము: నేనా? ... అబ్బబ్బబ్బబ్బ! ... (అని కంగారుగా వెనక్కి అడుగు వేస్తుంటాడు).

[జగన్నాథరావు ప్రవేశం—వస్తున్న రాముణ్ని ఢీకొంటూ.]

జగ: కండ్లు పోరలుక్రమ్మేయేం? వెధవ!? (చెవి పట్టుకొని) పోయి, 'టీ' పట్టుకురా. (రాముడు వెడతాడు. పోతురాజుతో) ఓహో! గురువుగారేమిటి? మిట్టమధ్యాహ్నం దయచేసారే?...కూర్చోండి! (రాముణ్ని "ఒరేయి!" అని పిలిచి "రెండు పట్టుకురా!" అంటాడు. "అలాగే" అని రాముడు వెళ్ళిపోతాడు). ఏమిటీవేళ మీ ముఖంలో అపరాహ్నభానుడూ, శరశ్చంద్రుడూ కలసి తాండవిస్తున్నారే?

పోతు: ఏముంది? చిటికెలో చిత్తుచేసేసాను, వెధవల్నందర్నీ. (మీసందువ్వి) హే! పాతికేండ్ల సర్వీసుమనది. మనం తల్చుకుంటె నల్లరాయి బ్రద్దలు కావాల్సిందే!

జగ: మిమ్మల్నే! ఎదుర్కొన్న ఆ మొనగాళ్ళెవరండీ?

పోతు : పోనిద్దురూ ! వెధవలు ! మీరుమాత్రం ఎలక్టై పూరు కున్నారంటే.

జగ : అలా చెప్పండి ! అదా మీ రౌద్రానికీ, సంతోషానికీ గల కారణం ... ఆ వెధవనూలు సప్లయి కమిటీల్లో మనం వేగలేమండీ !...ఏ మీలాంటివారో వుంటే ...?

పోతు : ఆఁ ! ఆఁ ! ఆఁ ! అలాఅనకండి ! మీలాంటి వుదార స్వభావులు లేకపోతే ఏవర్నుకు అన్యాయాలు జరిగి పోవ్రూ ?

రాము : (రెండుకప్పులు 'టీ' తెస్తాడు).

జగ : ప్చ్ ! ఏమిటో ?...('టీ' అందుకొని) ఇది ముందు తీసు కోండి ! ('టీ' త్రాగడం పూర్తయ్యాక) మీ మీటిం గులో నూలు సప్లయికమిటీ అభ్యర్థుల గురించి చాలా తర్జన భర్జన లొచ్చాయన్నమాట ?

పోతు : అమ్మా ! ఇప్పటిరకాలు ఏమనుకున్నారు ? అన్నీ గ్రూపు రాజకీయాలూ, అధికార వ్యామోహా లేకదండీ? ...మీ విషయం వచ్చేసరికి "గట్టుమీద కప్పల్లా ఎగిరెగిరి పడ్డారనుకోండి ! మనముందు వాళ్ళో లెక్కా? ...చిటికెలో చిత్తైపోయారు ?

జగ : పోనీ యీ దఫాకు నన్ను వొదిలేయకపోయారూ ?

పోతు: ఈ దఫాకేమిటి ? అసెంబ్లీ ఎలక్షన్కు కూడా మిమ్మల్నే నిలబెట్టేస్తా. త్రిమూర్తు లడ్డురానీయండి - లెఖ్ఖా ?

జవమా ? అని !

జగ : మామూలు నూలుసప్లయికమిటీకే యింతఅల్లరి జరిగినప్పుడు అప్పుడుమాత్రం అలాజరగదంటారా ?

పోతు : అదిగో ! అక్కడే పొరబడుతున్నారు. మనం తల్చుకుంటె సాధ్యంకాని దింకోటుందా ?

జగ : అసలు నన్ను వాళ్ళెతిరేకించడానికి కారణమేమంటారూ?

పోతు : కారణమా ? స్వతంత్రంవచ్చాక. మీరెంతో సంపాదించేశారట !

జగ : ఎవడి సంపాదనకూ కాకపోతే యీస్వతంత్ర మెందుకండీ?

పోతు : అదే. నేననేదీనూ.

జగ : బాగాఅన్నారు. ఊఁ !...ఇంకేం కారణం చెప్పండి ?

పోతు : అసలెప్పుడూ ఖద్దరు కట్టనేకట్టరట !...ఇంకా ఏవేవో అపరహరిశ్చంద్రుళ్ళలా వాగేసారు.

జగ : (సాలోచనగా) అసలు కాంగ్రెసువాళ్ళ కుండాల్సిన లక్షణా లేమిటి ?

పోతు : నిత్యఖద్దరుధారణ—ఒకటి.

జగ : అయితే రేపే ఖద్దరుతాను కొని కుట్టించేస్తా !

పోతు : ఏమిఅక్కరలేదు. నేను చెప్పేసాగా — మీ వంశం అంతా శుద్ధఖద్దరుధారులేననీ, ఆ మాటకొస్తే మన నెహ్రూయే విదేశాలకెడితే కంపెనీసూట్లే వేస్తాడనీ... అదీకాక ఈ రోజుల్లో ఖద్దరుటోపీపెడితేచాలు " వీడు

పక్కా బ్లాకుమార్కెట్టు రకమురా!" అని ప్రతీ పనికిరాని వెధవా అనుకోడమేకదండీ?

జగ: బాగా చెప్పారు గురువుగారూ! యదార్ధానికి మా విషయం మీకు తెలియనిదేముంది? ఆఁ! నాకే లక్షణాలుండాలి?

పోతు: నిత్యసత్యవ్రతం—రెండు.

జగ: ఓస్! మన కాంగ్రెసువ్యాంతా నిత్యసత్యవ్రతులేలావుంది? అదీకాక అబద్ధమాడకపోతే వ్యాపార మెలాజరుగుతుందండీ?

పోతు: ధర్మరాజంతటివాడు అబద్ధమాడగా, మీరూ, నేనూ, లెఖ్కా?

జగ: భేష్!...ఊఁ!...తర్వాత?

పోతు: అహింసాచరణ—మూడు.

జగ: అంటే- వాళ్ళ దృష్టిలో మాంసతిన్నా తప్పేనన్నమాట?

పోతు: ఏడిశారు. పోనిద్దురూ? "గులివిందపూస తన ముడ్డి క్రింద నల్లమచ్చెరగదనీ...

[లోపలనుండి "ఒరేయి! రాముడూ?" అన్న జగన్నాథరావు భార్యకేక. ఆ కేకవిన్న రాముడు "ఏమంటారు?" అన్నట్టుగా జగన్నాధరావువొంక చూస్తాడు.]

జగ: సరే. వెళ్ళు! (రాముడు వెడతాడు. పోతురాజుతో) వెధవసంసారం? విసిగించేస్తోందనుకోండి! ఇక బయాట

కెడితే నెత్తిమీద పుంజుడెంట్రుకల్లేని ప్రతీనేతగాడికీ లోకువై పోయాం.

రాము : (ప్రవేశించి) పొలంనుండి ధాన్యమొచ్చింది. ఎక్కడ వేయించమన్నారు ?

పోతు : (జగన్నాధరావుతో) ఏ మాత్రమేమిటండీ ?

జగ : ఆఁ ! అగ్రహారం పొలానివండీ ! ఏ మాత్ర మొస్తాయి ? అయిదెకరాల మాగాణేగా.

రాము : నాలుగు బళ్ళొచ్చాయటండీ !

జగ : ఏడిశావ్ ! మాటలమధ్య రావొద్దని నీ కెన్నిసార్లు చెప్పాను ? ఎలాగూ, పొగ రెక్కి ఏడుస్తున్నావులే !

రాము : అమ్మగారు చెప్పమన్నారండీ !

జగ : నోరుముయ్ !

పోతు : అయితే బాగానే వచ్చాయ్ !

జగ : ఏంబాగులెండి! అవైనా వందసార్లు ఆ కౌలుగాడి నెత్తి నెక్కి కూర్చుంటే వూడిపడ్డాయి. (రామునితో విసురుగా) మండువాలో దింపించండి !

[రాముడు వెళ్ళిపోతాడు. జగన్నాధరావు పెట్టిలోనుండి సిగరెట్టు తీసి కాలుస్తాడు. దాలయ్య భుజాన కుంచెతో ప్రవేశం.]

దాల : (నిట్టూర్చి, భుజానున్న కుంచె దింపుకుంటాడు.)

జగ : వొదిలిన సిగరెట్టు పొగలోంచిచూస్తూ) ఏమోయ్ !

దాలయ్యా! చాలారోజులకొచ్చావ్ ?

డాల : నూలుపోగు లేమైనా వచ్చాయేమోనని...

జగ : నూలుపోగులు! ఎక్కడనుం చూడిపడతాయనుకున్నావ్?

డాల : కోప్పడకండి బాబూ! మా కడుపుమంటలావుంది. యిప్పటికి అయిదుమాసాల్నుండి నూలుపోగుల్లేక యమబాధలు పడిపోతున్నాం. నా కూతురు పెండ్లికని ఇంటిపై అప్పు మీ వద్దనే తెచ్చానా? ఏదో అది కాస్తా కుదిరిందనేసరికి—ఆ డబ్బంతా హారతికర్పూరంలా హరించిపోయింది. మీకు చెప్పాలా బాబూ? కూర్చొని తింటె కొండలాగుతాయా? ... ఇదిగో, ఇప్పటికి మూడుమాసాల్నుండి కుంచెపట్టి సరికూలికెడుతున్నా. నూలులేనందున ఆ పనీ తిండి పెట్టడంలేదు... (దుఃఖముతో) ఇంకేం చెప్పమంటారు మా బాధలు ?

జగ : ఈ సోదంతా నాకెందుకులే! మీరిక నాలుగునెల్ల వరకూ నూలాశ వొదులుకోవల్సిందే!

డాల : "షాక్" కొట్టినవాడిలా తొందరగా) అదేంటిబాబూ? మేం బ్రతకడమెలా ?

జగ : (విసుగ్గా లేచి, సిగరెట్టు నేలనుకొడుతూ) బ్రతక్కపోత్తే చావండి! యీ వెధవగోడవంతా నాకెందుకు? (విసుగ్గా పచారుచేస్తుంటాడు.)

డాల : యీ నెలలో చాలాబేళ్ళొచ్చాయని దొరతనంవారు చెప్పారటగా ?

పోతు : చెప్పడానికేం ? ప్రతీ చేతగానిచవటా చెబుతాడు సొల్లుకబుర్లు ! ఇదేం ప్రకాశంగారి పరిపాలనకాదుగా— అన్నీ అమలుజరపడానికి ?

దాల : ఎవరి పరిపాలనొస్తే మాకేంబాబూ ? నాయకులు ఏవేవో చేస్తారని దేవుళ్లులా పూజించాం. ఇప్పుడు మా గతి — "రాజుగారని మనవిచేసుకుంటే మరిరెండు తన్నమన్నట్లు" వుంది.

జగ : నాయకులంటె మీ కెలా కనబడుతున్నారోయ్ ? అవసరమొస్తె కాళ్లు పట్టుకోడం...?

పోతు : లేకపోత్తే జుట్టు పట్టుకోడం !

దాల తమరే అలాఅంటె, మమ్మాదరించే వారెవరు ?

జగ : ఆదరిస్తారు ! నా దగ్గరెంతముంది మజూరీకి నేయడం లేదూ ? నీకెన్నిసార్లుచెప్పినా విన్నావ్ "ఆ నూలు కార్డిక్కడ పారేయ్‌వోయ్ ! ఏదో నేతకు నూలు యిస్తానంటే ?"

దాల : ఆ నూలుకార్డుకాస్తా యిచ్చేస్తే ఇక బ్రతుకు...?

జగ : వూడిగమైపోతుందనా ? అందుకనేకోసమే — అయినను వందలూ అప్పు పట్టుకెళ్ళావ్ ?

దాల : తమరలా అనకండి !. స్వతంత్రం వచ్చాక ఏదో కాస్త తిండి దొరికితే లాభమేమిటి ?

రాము : అయినా వందలూ, మా బాబుపై ప్రేమతో ఇచ్చారా? ఇల్లు మూసిచ్చారు.

జగ : [పోతురాజుతో] చూసారూ గురువుగారూ? "పిట్ట కొంచెం కూత ఘనము" ని (రాముడుపై హుంకరిస్తూ) వెధవన్ బయలుదేరావ్! ఇల్లు మూయిచ్చానట! (దాలయ్యతో) దాలయ్యా! వీడిని తీసుకుపో! నావద్ద పనికిరాడు. వారంరోజులనుండి చెబుదామనుకుంటున్నా. మొన్న గుడివద్ద మీటింగుకు బాకాతో కూడా బయలు దేరాడట!

దాల : (ఆత్రుతతో) బాకాతోనా?

పోతు : అదీకాక, ఆకలితో అఘోరించేవాడికి యీ రాజకీయ గొడవలెందుకు? అందులోనూ వేలుడంత లేడు కదా! చూడు! మనది పాతికేండ్ల సర్వీసు—ఎన్ని పాట్లు పడుతున్నామో?

దాల : (రాముడుతో) ఏమిరా? నన్నిలా బ్రతుకనివ్వరా? మనకెందుకురా — యీ గొడవలు. డబ్బునోళ్ళకు చెల్లింది—యీ గొడవలూ, పార్టీలూనూ.

రాము : మీటింగుదగ్గర కూరికే వెళ్ళా!

దాల : వెళ్లావ్! వెళ్ళవురా నీవు? కుండబరువు తలకెక్కుతుంటె? (జగన్నాధరావుతో) బాబూ! కనికరించండి! మీరుగాని ఆదరించకపోతే మా పని మరీఅధ్వాన్నమై పోతుంది.

పోతు : అందుకే మన తాహతునుబట్టి మనం నడుచుకోవాలి.

జగ : బాగాచెప్పారు. (అని కుర్చీలో కూర్చుంటాడు).

దాల : బాబుగారూ! (అని చేతులు నలుపుతుంటాడు)

జగ : ఇక వెళ్ళొచ్చు!

దాల : (చేతులు నలుపుతూ, దీనంగా ఏదో చెప్పబోతున్నట్లు) బాబుగారూ ?

జగ : (విసుగ్గా) ఇంకేమిటోయ్! ఆట్టె విసిగించకు!

పోతు : (జగన్నాధరావుతో) అతని గోడవేదో తేల్చిపంపే యండి!

జగ : ...వూఁ!...(దాలయ్యవైపు చూస్తాడు).

దాల : తల్లి లేనిబిడ్డ. మా కమల పెండ్లి నిశ్చయించామండి! మీరిచ్చిన డబ్బంతా అయిపోయిందండి బాబూ! ఇప్పుడు కొన్ని ధాన్యంగింజలేమైనా సర్దేరా— మిమ్మల్ని బ్రతికున్నంతకాలమూ దేవునిలా పూజించుకుంటాను.

జగ : ఎందుకు పూజించుకోవూ ?...బాకీఅడుగుతానని బలే ఎత్తేశావులే!

దాల : అయ్యా! మీ కాళ్ళు పట్టుకుంటా. దానికి ఆ మూడు ముళ్లూ వేసినపుణ్యంఅంతా మీ కుండిపోతుంది...

జగ : (కపటంగా) పొలాలనుండి యింకా ఒకగింజా రాలేదు. నేనే కొంటున్నా. ఇంకా కావాల్సివుంటె నీ కొడుకుని అడుగు! (రాముడితో) ఏమిరా? ఇప్పుడేగా? అరబస్తా

బియ్యం బజారునుండి కొని కొట్టుకొస్తా ?

రాము : (వ్యంగ్యంగా, కోపంతో) చిత్తం! అంతేనండి!

పాతు : ఇచ్చేదాన్నే పిండడం ? ఇంకోచోట తంటాలుపడ గూడదూ ?

దాల : మా పెద్దలనుండి లావాదేవీలున్న మీరే యిలాఅంటె ఇంకెవరుమాత్రం సహాయంచేస్తారు ?

జగ : ఇంకెళ్ళవోయ్!... మేం చాలావ్యవహారాలు మాట్లాడు కోవాలి !

దాల : (విచారంగా) వెళ్ళిపొమ్మంటారు ?
(లోపలనుండి "రాముడూ!" అన్న జగన్నాథరావు భార్య కేక.)

రాము : (కోపంతో) లేకపోతే యింకా యిక్కడ కూర్చో వయ్యా ! [విసురుగా వెళ్ళిపోతాడు.]

జగ : కూర్చోడమెందుకు ? ఇదిగో ! నెత్తినెక్కి నాట్యం చెయ్యండిరా !

దాల : మీ నాన్నగారికీ, నాకూ, ఎంతో స్నేహం ! ఒకప్పుడు ఆపదొచ్చి అర్ధరాత్రొస్తె నా భార్య నగలు తీసిచ్చింది. దాంతోనే ఆయనా పెద్దవాడయ్యాడు. నగలిచ్చిన నా భార్యా పోయింది; నేనూ యిలాఅయిపోయాను. మీ రప్పుడు చిన్నవారు. ఆ సహాయాన్నైనా జ్ఞప్తికి తెచ్చుకోండి!

జగ : చాల్ చాల్లే! ఇక వెళ్ళు!

దాల : వెళ్తున్నా!...వెళ్తున్నా!... (కుంచె భుజాన్నేసుకొని వెళ్ళిపోతాడు)

పోతు : పిచ్చివాడు! చంటికుర్రాడు చందమామను చూచి ఏడిస్తే అది దివినుండి భువికొస్తుందా? (ఇరువురూ నవ్వుతారు)

జగ : (వెళ్తున్న దాలయ్యను పిలుస్తూ) దాలయ్యా?

దాల : (ఆశతో) బాబు! (అని వస్తాడు)

జగ : అన్నట్టు!...ఎప్పుడు పెళ్ళి?

దాల : ఎల్లుండండి!

జగ : ఎల్లుండా?—సరే వెళ్లు!

దాల : (నిరాశతో వెళ్లిపోతాడు)

పోతు : అతని కూతురిపెండ్లి ఎప్పుడైతే మీ కెందుకు?

జగ : (లేచి) ఇలారండి చెబుతా! (ముందుకు తీసుకెళ్ళి చెవిలో ఏదో చెబుతాడు. పోతురాజు ముఖంలో ముందు అనంగీకార చిహ్నాలు ద్యోతకమవుతాయి. తరువాత ఉత్సాహంతో)

పోతు : ఓస్! అదెంతపని! మనం తల్చుకుంటె నల్లరాయి బద్దలు కావాల్సిందే! (చిటికేస్తూ) చూడండి! (జగన్నాధరావు చెవిలో ఏదో వూది) "......" అలా అని ఒక వుత్తరంరాసి పారేస్తే సరి!

జగ : సెబాష్! పోతురాజుగారూ? బలే ఐడియా చెప్పారు.

మీరా పనిచేసేస్తె, నేనా దాలయ్యను బాకీగురించి తగలొట్టని ఎలాగో మెడ విరిచేస్తా !

పోతు : అయితే, యిప్పుడే బయలుదేరతా. హే ! మనం తల్చుకుంటె నల్లరాయి బ్రద్దలుకావాల్సిందే ! (వెళ్ళి పోతూ, అరటితొక్కపై అడుగేసి పడతాడు)

జగ : అరెరె ! (లేవనెత్తుతూ) "శుభమా" అంటూ బయలుదేరితే యీ అభ మేమిటండీ ?

పోతు : (లేచి, దులుపుకుంటూ) మరేం ఫర్వాలేదు; ముందు కష్టం—తరువాత సుఖానికేకదండీ ! (అని నవ్వి వెళ్ళి పోతాడు)

జగ : (పోతురాజునుచూచి విషపునవ్వునవ్వుతూ) పోతురాజు-ఇక నా చేతిలో కీలుబొమ్మ ! (సిగరెట్టు కాలుస్తూ, ఎదుటికొచ్చి) కమలా ?...ఆహాహా ! ఏమి నీ అందం ? ...నీ అంగసౌష్ఠవం నన్ను అయస్కాంతంలా ఆకర్షించు తోంది కమలా !...నీ పెదవులపై చిందులుత్రొక్కే తేనెబిందువుల్లాంటి చిరునవ్వులకై నా నోరూరుతోంది. నీ వక్షోజాల్లో నాట్యంచేసే నవయౌవ్వనం నన్ను పులకితం చేస్తోంది...కమలా ! ఆహాహా ! నిజంగా నిన్ను చూస్తే "బ్రహ్మకైనా పుట్టుతుంది రిమ్మతెగులు !" —ఆహాహా ! (అని సిగరెట్టుపొగలోంచి శూన్యంలోకి విషనగవు నొదులుతూ, లోపలికి వెళ్ళిపోతాడు)

తెర—

# 2

[దాలయ్య యిల్లు. ఎదురుదండేనికి నూలుపోగడలు, నేసేకేలూ వుంటాయి. బూజుపట్టిన మగ్గం గోడకు, క్రింద ఓ ప్రక్క రాటమూ, రాటూవుంటాయి. దాలయ్యకూతురు కమల—వితంతువు, పెళ్ళిసంతోషంతో పాట పాడుకుంటూ లోపలినుండి ప్రవేశిస్తుంది. లంగాపై పైటవేస్తుంది)

కమల : (పాట)

నేడేగాదా - నా జీవితవసంతశోభా !
హృదయతంత్రులను
ప్రమద పల్కులతో
మీటి, మీటి కలగానముచేసే
నేడేగాదా, పతి—నా వితంతుఎదకోప్రాభా !
నా...పతిని
బాహుపాశముల
నయనదృక్కులతో
కట్టి, కట్టి దివియానముచేసెద
నేడేగాదా - నా జీవిత వసంతశోభా !

(ఇంతలో తండ్రి దాలయ్య, భుజాన బియ్యంమూటతో ఇంకోవైపు సరికుంచెతో ప్రవేశించి, సంతోషంలో నున్న కమలముఖంచూచి, ఓ క్షణం తనబాధమరచి, చిరునవ్వుతో నిలబడతాడు. కమలపాట పూర్తయ్యాక

ఆలాపనలో గిర్రునతిరుగుతూ తండ్రినిచూచి హఠా త్తుగా ఆగి, సిగ్గు, భయం, చిరునవ్వుతో "నాన్నా!" అని మాట, కుంచె అందుకుంటుంది.)

దాల : (చిరునవ్వుతో తల నిమురుతూ) ఏమిటమ్మా? సంతో షం పొంగి పొరలిపోతుంది ?

కమ : (సిగ్గుతో) ఏం? సంతోషంలే, నాన్నా ? యీ వేళ నా పెండ్లేమిటి? నీకీ బాధ లేమిటి?

దాల : నీ నవ్వులముఖం నా బాధను తరిమేసిందమ్మా! సంతో షం ఒకరిగు త్తసొమ్మా తల్లీ ! (నిట్టూర్చి) ఇంతకీ ఆ శనే శ్వరుడు మనల నా సంతోషంతాక్కుండా సంకెళ్ళేసా డమ్మా! పోనీలే! మనకున్నంతలోనే ఆ సంతోషాన్న నుభవిద్దాం!...ఏదో యీ పెళ్ళికాస్తా ఐపోత్తే, యీ ముసలో డెలావున్నా పర్వాలేదమ్మా!

కమ : (తండ్రిదగ్గర కెడుతూ) అదేమిటి నాన్నా! ఆవిచారం ? అంత నీవు బాధపడి పెండ్లిచెయ్యొద్దని చెప్పాగా? ఒకరి పెండ్లి ఇంకొకరికి చావుగా పరిణమించినప్పుడా పెండ్లెం దుకు నాన్నా ?

దాల : లేదమ్మా! నీ పెళ్ళి జరక్కపోతే లోకం వూరుకోదు.

కమ : (తీక్ష్ణంగా) వూరుకోకపోతే వురేసుకోనియ్! మనకేం.

దాల : మనకే వురేస్తుందమ్మా! యీ లోకానికి మనం బానిసలం.

కమ : కాదు, నాన్నా !

దాల : కాకపోయినా, ఎదురీదలేమమ్మా !

కమ : ఏమైనాసరే, మనచేతిలో నాలుగురాగికాసులున్నప్పుడే పెళ్ళిసంగతి చూద్దాం.

దాల : ఇప్పటికి పెట్టిన రెండు ముహూర్తాలూ ముక్కలయ్యాయి. యీ సుముహూర్తానికిగాని నీ పెళ్ళి జరక్కపోతే, ఇక యీ ముసలాడిబొందిలో ప్రాణముండగా నీ పెండ్లి జరగదమ్మా !... కానీయ్ ! ఇంకోగంటకో, రెండుగంటలకో పెళ్ళివారుకూడా వచ్చేస్తారు...

కమ : పెండ్లయిపోతే పెద్దక్కలా నేనూ అత్తవారింటికిపోతే, నీకు గంజికాచేవారెవరు నాన్నా ?

దాల : నా గంజి సంగతలావుంచి, నీ వత్తవారింటిలో సుఖంగా వుంటే, ఇకతండ్రికి కావలసిందేమిటమ్మా ? (క్షణమాగి) సరేకాని, రాముడేడి ?

కమ : కిళ్ళీకొట్టుదగ్గరకని వెళ్ళాడు.

దాల : వెధవ ! బాకాత్తోకూడా బయలుదేరుతున్నాడట !... ఏడీ, పిలు?

కమ : (కాస్తప్రక్కకువెళ్ళి) రాముడూ...!

దాల : అబ్బాయి రాముడూ ? ... రాముడూ ?...ఒరేయి రాముడూ ? (పలుకడు) ఓ రాముడూ ?

రాముడు : వస్తున్నా ! నాన్నా ! (సిగరెట్టు కాల్చుకుంటూనే వచ్చి, తండ్రినిచూచి భయంతో పారేస్తాడు.)

దాల : (అదిచూచి) ఏమిటిరా, అది ?

రాము : అబ్బే ! ఏమీలేదే ?

కమ : అబద్ధాలుకూడా ఆడుతున్నావేం ?

రాము : లేదక్కా !

దాల : లేదేం వెధవ ! ... ఆ జగన్నాధరావుకు చెల్లిందిరా. ఏంచేసినా !

రాము : స్రారిబాబుల సొమ్ముంటేసరి ! అందరికీ చెల్లుతుంది.

దాల : అడ్డేముంటె తెడ్డేసునడం నేర్చుకున్నావ్ !

కమ : వాడ్నలా కసరకు నాన్నా !

దాల : వీడ్ని వెనకేసుకురావమ్మాఁ !

రాము : నాన్నా ! నన్ను ఏడిపిస్తేతిట్టొవ్వులేగాని, ఆ జగన్నాధ రావువద్దమాత్రం ప్రాధేయపడకు నాన్నా ! వాడొట్టి పిసినిగొట్టు ముండాకొడుకు !

దాల : నోరుమూయ్ ! యజమానివద్దా, ఇంతేవెధవ ! ఇటు వంటి వేషాలేస్తే గుమ్మం త్రొక్కనివ్వను. జాగ్రత్త !

రాము : (ఏడుస్తూ) అలాగే వెళ్ళిపోతానులే. (రెండడుగులు వేయబోతాడు.)

కమ : (తమ్ముడ్ని లాక్కొని ఓదారుస్తూ) అదేమిటి నాన్నా ?

దాల : నీకు తెలీదమ్మా ! అసలక్కడ వ్యవహారం చెడగొట్టింది వీడు. మనం ఎవరిదగ్గర ఎలామసులుకోవాలో, తెలుసు కోవాలిగాని ప్రతీదానికి అడ్డంతిరుగుతుంటె పనులు జరుగుతాయా ?

రాము : నేనేం అడ్డం తిరిగాను ?

కమ : అసలాయన్ని అడగిం దేమిటి నాన్నా ?

దాల నూలుపోగులేమైనా వచ్చాయేమోనని.

రాము : ధాన్యం అడగలేదూ ?

కమ : అడిగితే ?

రాము : లేవు పొమ్మన్నాడు. పైగా అమాంతంగా అబద్ధ మాడేసాడు. అప్పుడే అగ్రహారం పొలంనుండి నాలుగు బళ్ళు ధాన్యమొచ్చింది. పండించినోడికి తిండి లేకుండా లాక్కొచ్చాడు. పైగా (వ్యంగ్యంగా) "ధాన్యం లేక నేనే డబ్బుపెట్టి కొంటున్నాన" ని దబాయించేసాడు

దాల : పోనీలే ! వాడికర్మ వాడిది.

కమ : మనకు వరుసకు బంధువన్నావుగా. అందులోనూ వాళ్ళ తండ్రికి నీ వెంతో సహాయం చేసావన్నావ్ ?

దాల : ఒక్కొక్కప్పుడు అలా బళ్ళు ఓడలూ, ఓడలు బళ్ళూ ఔతాయమ్మ.

రాము : ఆఁ ! అవుతాయి. వాళ్ళకంటె కుక్కనయం— పెడితే విశ్వాసముంటుంది.

దాల : నన్నిక బాధపెట్టకురా. విశ్వాసం లేకపోతే పోనీ ! 'గరికతిన్న గాడిద చెడుతుందిగాని గరిక ఎప్పుడులాగే మొలుస్తుంది.'

రాము : మొలవకేం ? మొలుస్తుంది. హు ! నీతి కీ లోకంలో

స్థానం లేదు. ఆఖరికి వాడికి మననూలుకార్డు అడిగి బాని సగా చేసుకుంటానునే దమ్ములుకూడా వచ్చేయి.

కమ : అవును నాన్నా! నీవిక ఆయనవద్ద ప్రాధేయపడకు! అదేమిటో ఆతని ముఖంచూస్తేనే దడపుడుతుంది. మేం నీళ్ళు తెచ్చే నూతిప్రక్కనుండి వాడు పోతున్నపుడల్లా క్రోరచూపులు విసరడమే!

బాల : వాని మాటలుచూస్తే నాకూ పుడుతుంది. కాని పను లెలాజరుగుతాయమ్మా?

రాము : అంచుకని అనని కమ్ముడుపోతామా?

కమ : ఇన్ని బాధలతో నే నీ పెండ్లి చేసుకోను నాన్నా!

బాల : పోనిలే అమ్మా! వాడిమాట వాడికే వుండిపోతుంది. (కాస్తసంతోషంతో) ఇదిగో, మన సాలిపేట సరికూలి వాళ్ళంతా రెండుకుంచాల బియ్యమిచ్చారు...

రాము : చూచావా? నీతి ఎవరిలోవుందో?

బాల : నువ్వు పోరా!

రాము : వెళ్ళిపోతున్నానులే. నీ వెలాగోపడు!

బాల : పడకపోతే నీవు తెచ్చి పోషిస్తున్నావురా. పదాదయింది ఇంతవరకూ ఒక రాగికానీఅయినా తెచ్చావ్?

రాము : నన్ను చావమంటావా? వాడు కూడు పెట్టడంతప్ప, ఓ దమ్మిడీ చేతికివ్వడు. ఇంకోచోటకు పోతానంటె "అక్కడే పదికాలాలపాటు పడివుండాలంటావ్!"

దాల : వెధవమాటలు నేర్చేవ్ !

రాము : పోనీలే. బండరాయిలా అక్కడే పడివుంటా. (వెళ్ళి పోతాడు)

దాల : కమలా ! పెద్దక్క ఇంట్లోవుందా ?

కమ : పొరుగింటికి వ్రాసులాడ్డానికి వెళ్లిందిలే !...ఎందుకు ?

దాల : ఇంట్లో ఆ నాలుగుపనులూ చూచేస్తే. నేను వెళ్ళి ముహూర్తానికి అందరిని పిలుచుకొద్దామని.

కమ : అది చూడకేం? బావనింకా పిలవలేదని మూతి ముడు చుకు కూర్చొంది.

దాల : (దీనంగా, రెండడుగులు ముందుకేసి) ఎలాపిలుచు కొచ్చేది ? పిలిస్తే పంచా- కండువా అయినా పెట్టాలా? మనకు కూలిడబ్బులు యివ్వలేక ఏడుస్తారుతప్ప, నేత బట్ట బజారులో వర్తకులు, ఇష్టమొచ్చినట్లల్లా అమ్ము కుంటున్నారాయ ! ఇంకేలా చెప్పు ?

కమ : పెట్టకపోయినా పిలిచేస్తే దానిగోల తగ్గుతుంది.

దాల : పిలిచి లేదంటె రచ్చకీడుస్తారమ్మా !

కమ : సరే. నీ యిష్టం నాన్నా ! తల్లిదండ్రుల సుఖంచూడని కూతుళ్ళతో ఇదే నరకం !

దాల : (కమల తలనిమురుతూ) తెలివైనదానవమ్మా! అన్నట్టు ఇవిగో ! పదిహేనురూపాయిలు నీ దగ్గరుంచు. ఇందు లోనే నీ పెళ్ళంతా పూర్తికావాలి, (రూపాయిలు

కమల కివ్వబోతాడు.)

కమ : (పుచ్చుకుంటూ) ఈ రూపాయ లెక్కడివి ?

దాల : (బాధతో, కంపిస్తూ) మగ్గం బేరంపెట్టేసానులే !

కమ : ఆఁ ! (చేతిలో డబ్బు హఠాత్తుగా క్రిందకు జారిపో తుంది. మగ్గం చూపుతూ, ఆవేదనతో) ఈ మగ్గమే ! పస్తులతో కళావిహీనమైన మన కొంపకు పసుపు కుం కుమదిద్దిన యీ మగ్గాన్నే అమ్మడం ? ఎన్ని బుటా చీరలు నేసింది ?...ఎన్ని మానాల్ని కప్పింది నాన్నా! ఇటువంటి మగ్గాన్నా? మనం అమ్ముకోడం? తండ్రిపై వాలుతుంది)

దాల : (ఓదారుస్తూ) నూలింకా రావడం లేదుకదమ్మా! నీపెళ్ళి కాస్తా ఐపోతే, నేనీ సరికూలిచేస్తూనే, అర్ధలో పావలా వెనకేసి, మగ్గంకొనేస్తానమ్మా !

కమ : చేయి జారిపోయాక మళ్ళీవస్తుందా ?

(రాముడు పరుగెత్తుకుంటూ ప్రవేశం)

రాము : ఇదిగో నాన్నా! పెండ్లివారినుండేదో వుత్తరంవచ్చింది ...ఇది చదువక్కా !

కమ : (వెంటనే పుచ్చుకొని కవరుచింపి, కంగారుగా చదు వుతూ) "...దాలయ్యకు...నీ వింత..." (నోటితో చదువలేక కండ్లతో చదువుతూ) ఆఁ!...ఏమిటీ వుత్త రం ?...నాన్నా ! (స్పృహతప్పి పడబోతుంది)

దాల : ఏమమ్మా ?

రాము : అక్కా ! (కమలను స్పర్శిస్తాడు)

దాల : (పడబోతున్న కమలను పట్టుకొని) ఒరేయ్! నీళ్ళు పట్టుకురా. (రాముడు వెడతాడు. దాలయ్య, కమల చెమట కమ్మిన ముఖాన్ని తుడుస్తూ) అమ్మా! కమలా! (పెల్లుబికిన దుఃఖంతో) కమలా...! ఏం జరిగిందమ్మా! నీ దుఃఖాన్నే ఆనందంగా కోరుకొన్నవారెవరమ్మా! ... హా! విధీ! ఎందుకయ్యా, యీ మూలిగే నక్కలపై తాటికాయలు పడవేయడం?" కమలా! (కంటనీరొట్టి తిలకిస్తుంటాడు).

నేపథ్యంలో : పాట.

ఆశలే యడియాశలై
అనాథుల పాలిటి కత్తులై
అడియాశలె, ఆశలై
ధనాంధుల పాలిటి సొత్తులై
చెలగునందాక - ధరణిపై
ఆగదోయ్! - నీ కన్నీటిధార!

దాల : (గద్గదకంఠంతో, కమలముఖమెత్తుతూ) ఒక్కసారి చూడమ్మా!...త్వరగా రారా! రాముడూ!

రాము : వస్తున్నా! నాన్నా! (అని నీళ్ళు తెచ్చి, కమలముఖంపై చల్లుతాడు).

దాల : (కమలముఖం తుడుస్తూ) ఏమిటమ్మా! ఆ వృత్తరం? కాస్త జీవితపుటంచుల తీపినైనా చవిచూడని, నీ అభా

గ్యజీవితంలో విషపుచుక్కలు వెదజల్లిన ఆ వుత్తర మేమిటమ్మా ?

కమ : (తేరుకొని, వొంగుతుస్తూ) వుత్తరమా ? (ప్రక్కనున్న వుత్తరం చూపుతూ) నీవు వాళ్ళకు దగాచేసావట నాన్నా ! వెధవ...ముండనని...చెప్పలేదట !

దాల : వాళ్ళడుగ లేదు... నే చెప్పలేదు...అయితే ?

కమ : "నీ కూతురికి ముసుగువేసి...మూల కూర్చోబెట్టు" అని...(పెదవులు వొణికిపోతాయి. చేతుల్తో ముఖం కప్పుకొని వెక్కుతుంది).

దాల : (దగ్గర కెళ్ళి) అయ్యోతల్లీ ! బాల్యంలోనే పెండ్లి చేసి, నీకు వైధవ్యం తెచ్చిపెట్టిన పాపిష్ఠిని నేనేనమ్మా ! ఏడుస్తాడు).

రాము : (దుఃఖాన్ని దిగమ్రింగుతూ ఎదుటికొచ్చి) అర్ధాయుష్షు ముండాకొడుకులంతా పెళ్ళిళ్లు చేసుకుంటె వెధముండ లవ్వక ఏంచేస్తారు ?

[పోతురాజు ప్రవేశం.]

పోతు : హా ! పాతికేండ్లసర్వీసు మనది. మనం తల్చుకుంటె నల్ల రాయి బ్రద్దలు కావాల్సిందే !

రాము : (తీక్ష్ణంగా చూచి, వ్యంగ్యంగా) బ్రద్దలై పోతుంది అప్పడాలదొంతర ! (కోపంతో ఎదురెళ్ళి) పెండ్లిపేలాలై మే మేడుస్తుంటే, మీకు వేళాకోళమా ?

కమ : (ప్రక్కకెళ్ళి నిలబడుతుంది)

[రొనరొనలాడుతూ - జగన్నాధరావు ప్రవేశం]

జగ : పెండ్లి ! వెధవముండను చేసుకునేవెధవ ఎవడోయ్ ? (కమల బాధతో చెవులు మూసుకుంటుంది) నీ పెండ్లి గొడవ కట్టిపెట్టి ముందు నీ యింటిబాకీగొడవ తేల్చు !

దాల : మేమిలా ఘొల్లున ఏడుస్తుంటే, మా పుండుపై కారం చల్లి మరింత ఏడిపించి, ఇప్పుడే డబ్బు తెమ్మని బలవంతంచేయడం, మీకు సబబా ? కనికరించండి ! జగన్నాధ రావుగారూ ?

జగ : (పోతురాజుతో) చూడండి గురువుగారూ వీళ్ళతమాషా! నిన్న నూలుకార్డు పారేయకూడదా ? అంటే బ్రతుకే వ్రాడిగమైపోతుందని నిక్కచేసాడు. ఇప్పుడు కనికరించాలట కనికారం ?

పోతు : (సైగచేస్తూ) పోనీలెండి ! యీ పూట సూరుకోండి ! ...దాలయ్యా ? ముహూర్తం పెట్టేటపుడు ఎంతజాగ్రత్తగావుండాలి తెలుసా ? అసలు బలమంతా అందులోనేవుంది.

జగ : సరేనోయ్ ! దాలయ్యా ! పోతురాజుగారిమాట వినాల్సివస్తుంది. రేపింటికొచ్చి ఏదో తేల్చుకోపోతే కుదరదు. (రాముడుతో) పదరా ! ఇక్కడుండి ఏంపాటుపడాలి ? ఇంటిలోపనులు నీ బాబుచేస్తాడా ?

కమ : ఈ వేళకు నా తమ్ముడ్నిక్కడుండనివ్వండీ !

జగ : కుదరదు. నీదు తింటూంట - నా తిండి! (నడుస్తూ) రా రా! చూస్తావేం ?

రాము : (వ్రూగిసలాటతో తండ్రివొంకా, జగన్నాధరావు వొంకా చూస్తూ నిలబడిపోతాడు)

దాల : తల్లిలేనిపిల్ల. ఇప్పటికి పెట్టిన మూడుపెండ్లి ముహూర్తాలూ ముక్కలై పోయాయి. (గద్గదకంఠంతో) కాస్సేపు ఏడవడానికైనా ఒప్పుకోండి!

జగ : రావాల్సిందే!...చూస్తావేం ? నడరా! నడు! (ఇద్దరూ వెళ్ళిపోతారు.)

రాము : వస్తున్నా! పదండి! (అంటూ వాళ్ళను సాగనంపి, ఎదుటికొచ్చి) కసాయి ముండాకొడుకులు! హు! ముహూర్తబలం లేదట! వెనుక రెండో ముహూర్తానికీ ఇంతేఅన్నారు అంతా. ఆఖరికి తేలింది కుంభకోణం. చెడగొట్టిన వెధవలు బయటపడ్డారు. (వెనక్కి వచ్చి) అక్కా! ("భేర్" మంటాడు. తండ్రితో) నాన్నా! వెళ్తున్నా! (రెండడుగులు ముందుకేసి, ఏదో జ్ఞప్తికొచ్చినవానివలె ఒకడుగు వెనక్కేసి) చెప్పడంమరిచా, నూలొచ్చింది...కార్డు తీసుకురా. (ఏడుస్తూ) వెళ్తున్నా నాన్నా ?

దాల : నూలు! (ఎదుటికి చూచి) అదే వస్తుంటే మనకీబాధ లెందుకు ? యీ నా కూతుర్కి పేకమేడల పెళ్ళి చేయడ

మెందుకు...ఇప్పుడుమాత్రం ఆనూలొచ్చిలాభ మేమిటి? చేతిలో చిల్లిగవ్వైనా లేదు...సరే! వెళ్ళరా! అన్నిం టికీ ఆ శ్రీశైలం మల్లిఖార్జునుడే వున్నాడు.

[రాముడు వెళ్ళిపోతాడు]

కమ: ("భేర్" మంటూ) నాన్నా! (అని తండ్రిరొమ్ముపై వాలుతుంది)

దాల: ఏడవకమ్మా! ఏంచేస్తాం? డబ్బా? ఖర్చయిపోయింది ...నీ పెళ్ళా? వేలాలై పోయింది. డబ్బులేని యీ స్థితిలో ఏనాటినుండో కలలుకంటున్న నూలొచ్చి కూర్చొంది. ఇంతకీ ఆ కాశీవిశ్వనాథునిదయ అలావుంది ...ఏంచేస్తాం? (ఏడుస్తూ) ఏడవకమ్మా! (అని కూతురు ముఖంచూస్తూ, గుండెకరిగి, ఒక్కసారిగా) కమలా? (అని కమలతలపై ముఖం పెట్టి ఏడుస్తాడు).

నేపథ్యంలో పాట.

ఆగదోయ్! - నీ కన్నిటిధార!

— తెర —

# 3

[జగన్నాథరావ్ ఇల్లు. మొదటిరంగంలాగే, తెర లేచే సరికి నేపథ్యంలో జనసమూహావు కేకలు, "నూలు యివ్వాలి" బ్లాకుమార్కెట్టు "నశించాలి" అని. అంతవరకూ లోపల జగన్నాథరావుతో మంతనాలాడిన పోతురాజు ముచ్చెమ్మట లతో హడావిడిగా బయటికొస్తాడు).

పోతు : (బయటగుమ్మం వైపుకెళ్ళి) సోదరులారా! నూలువిష యం జగన్నాథరావుగారితో మాట్లాడి సాయంత్రం అన్నిసంగతులూ తేల్చి చెబుతా. (రెండోగుమ్మంవద్ద కెళ్ళి) ఇండ్లకు వెళ్ళండి!

("మేం వెళ్ళం!" "ఇప్పుడు తేలాల్సిందే!" అన్న కేకలు.)

నా మాట నమ్మండి! మీకు హామీయిస్తున్నా! సాయంత్రానికి తేల్చేస్తా! (అని ఇంకా అలాగేవున్న జనాన్నిచూచి, మొదటిగుమ్మంవద్దకెళ్ళి) అరె! ఇంకా వున్నారే? సాయంత్రం తప్పకుండా తేల్చేస్తా. విశ్వాస ముంచండి! వెళ్ళండి!...వెళ్ళండి!

(తిరుగుముఖం పట్టిన జనం కేకలు. జనంమధ్య్య ఓ వన్నెనిగొంతు. "నీ మీదా విశ్వాసం?" అని "సరే సాయంత్రం వస్తాం" అన్న మాటతో జనం వెళ్ళిపోతారు.)

(శ్రమతీరినట్లు, జేబురుమాలుతో విసురుకుంటూ,

నిట్టూరుస్తాడు) అమ్మయ్యా ! యిప్పటికి బ్రతికి బయటపడ్డాం. (చిరాకుతో పచారుచేస్తూ) వేవుకు తింటున్నారు వెధవతొత్తు కొడుకులు ! హు ! పాతికేండ్ల సర్వీసుమనది. మనం తల్చుకుంటె నల్లరాయి బ్రద్దలుకావాల్సిందే ! (పచారుచేస్తూ, వెనక్కి తిరిగేటప్పటికి దాలయ్య ప్రవేశం) ఏం? నీవొచ్చావేం?

దాల : బాబూ ! జగన్నాధరావుగారు లేరూ ?

పోతు : ఏం ? కొంపమునిగిందేం ?

దాల : ఏదో, నూలు పోగులొచ్చాయంటె ముష్టెత్తుకు డబ్బు తెచ్చుకున్నా !

పోతు : అదా సంగతి ! మీ రొట్టి గొర్రెలోయ్ ! దాలయ్యా?

దాల : ఏంబాబూ ?

పోతు : మిల్లునూలు కావాలనేవాడు నేతగాడే ? గాంధీగారు నెత్తీ, నోరూ కొట్టుకొని చెప్పారు—"ఏకులొడకండిరా!" అని. అదివింటె మనకీ తిప్పలొస్తాయా ?

దాల : ఏకులొడుక్కుంటె ప్రొద్దుగ్రుంకేసరికి అణాడబ్బులైనా వస్తాయా ? బాబూ !

పోతు : ఇటువంటికబుర్లు చెప్పబట్టే చేనేతపరిశ్రమ యిలా తగులడింది, ఔరంగజేబుకూతురు పదహారుపొరల చీరకట్టి దర్బారులో కొస్తె "ఇదేమమ్మా ? దిగంబరిగా వచ్చావ్ ! ?" అన్నాడు తండ్రి. అంతెందుకు ? పాతిక పొరలచీర అగ్గిపెట్టిలో యిమిడ్చి మనోళ్ళు పిక్కోరియా

రాణీకి పంప లేదూ? ఇవి దేన్నితో నేసేరనుకున్నావ్? పిచ్చోడా?—ఏకులోడికి కాదూ?

రాము: (ఆర వేయడానికి నూలుపిడులు తెస్తూ ప్రవేశించి, వ్యంగ్యంగా) ఇంతకీ ఆ వస్త్రాలేమిటంటారూ?

పోతు: (చివాలున చూచి) నేతవస్త్రాలంటాను.

రాము: (విరగబడి నవ్వుతూ) అవి దేవతావస్త్రాలండి గురువు గారూ!

పోతు: ఏడిశావ్ వెధవ! నీకూ, నీబాబుకీ ఎవడో ఎక్కించాడు

రాము: ఎవ్వడూ ఎక్కించడు. గాంధిగారు జీవితకాలమంతా-తలక్రిందులా దపస్సుచేసినా సాధించలేనివి, మీరిప్పుడు సాధించబూనడం, మింటనక్షత్రాలు లెక్కించడమే గురువుగారూ! బండికి గుర్రాన్నెనక్కి కడితే ఆ బండి కదులుతుందంటారా?

పోతు: ఆరిపిడుగా! ఎవ్వడురా నీ కిది చెప్పింది? దేశమంతా రాట్నంపడితే యీ వెధవమిల్లునూలుగురించి, యిన్ని గొడవ లెందుకు? గుద్దులాట లెందుకు?

రాము: నాన్నా! యీ మాటలు నమ్మకు. మొన్న మీటింగులో ఏంచెప్పారో తెలుసా! (దాలయ్యను సమీపించి) "ఖద్దరునూలు వాడమని భోదించడం, మిల్లు యజమానులకు "మీ చిత్తంవచ్చినట్లు నూలంతా విదేశాల కెగుమతిచేసుకొని లాభాలు గడించుకోండి!" అని చెప్పడంలాంటిదే" నని.

"ఏంచేస్తున్నావురా!" లోపలనుండి కేక. "వస్తున్నా!" అని పిడులు దులుపుకుంటూ, రెండోగుమ్మంలోకి వెడతాడు)

పోతు : చూడవోయ్! దాలయ్యా! నీ కొడుకు?

దాల : వాడికి చిన్నప్పటినుండీ యీ తలబిరుసెక్కువేనండి! అబ్బాయిగారున్నారండీ?

పోతు : వున్నా - లాభంలేదోయ్! ఆయనమాత్రం ఏం చేస్తాడు? వచ్చిన అరబేలూ ఏ కొద్దిమందికో సరిపో యిందంతే!

దాల : (ఒక్కసారిగా, కాంతితగ్గిన ముఖంతో - తటాలున అం దుకొని ప్రాధేయంగా) రాకరాకవచ్చిన అరబేలుకూ ఇలానీళ్లుకార్చేస్తే, ఇక ఎన్నాళ్ళని మేమిలా ఎండిన డొక్కలు చేత్తోపట్టుకు ఉండడం?

పోతు : ఇంకానయం! జగన్నాధరావుగారిలాంటి వుదారులు, నూలుడీలర్లుగా వుండబట్టి సరిపోయింది. లేకపోతే అసలు మనకంటికీనూలుపోగైనా కనపడేదా?

దాల : ఇంతకీ - మా కర్మ.

రాము : మళ్ళీ పిడులతో ప్రవేశించి దులుపుతూ) కర్మగాదు. శ్రార్ధమూకాదు... మేకలపై మొకానికి పెత్తనమిస్తే వచ్చేముప్పిది. యీ నూలుపంపక మే సొసైటీలకిచ్చినా బాగుండేది.

పోతు : ఆఁ! బాగుణ్ణు! దున్నపోతు యీనిందంటె దూడను కట్టెయ్యమన్నట్టుణ్ను.

రాము : (కోపంతో) అవును. మరి! పోతురాజుకు మేకపోతు ఎలావస్తాయి? (విసురుగా లోపలికెడతాడు)

పోతు : రాముడూ...! (హుంకరిస్తాడు).

దాల : (దగ్గరకెళ్ళి, గడ్డంపట్టుకొని) పోనీలెండి! ఆ వెధవతో ఏంటి?-ఇంతకీ నూలుపోగులుమాట లాభం లేదంటారా?

పోతు : వెధవ మిల్లులమీద ఆధారపడినంతకాలమూ మన పనింతే. చేతిలో కానీవుంటే స్వర్గానికి నిచ్చెనవేసే త్రాగుబోతు మిల్లుకార్మికులమీద ఆధారపడినంత కాలమూ, మనబ్రతుకింతే. చూడు! యీ నెల్లో వాళ్ళు సమ్మెచేసేరు. మనమగ్గాలు మూలబడ్డాయి. గతనెల్లోది ఏదో కాస్తనూలుంటె అదే మనకు ప్రసాదమైపోయింది. అదైనా అయిదులక్షల మగ్గాలకు సప్లయికావాలి మాటలా?

దాల : అదీ ఆలోచించవలసిందే అనుకోండి! అయితే మేమిలా చావాల్సిందేనా ?

రాము : (పిడులతో ప్రవేశించి) చావకపోతే ఏంచేస్తాం? (పోతురాజు ముందుకెళ్ళి) ఏమండీ! పోతురాజుగారూ? అయిదులక్షల మగ్గాల్ని కంట్రోలుచేసి కార్డులు పంచారుగాని—యీ భై మిల్లుల్నలా చేయలేరే? అందుకే వాళ్ళ ఆటలు సాగుతున్నాయ్! లేకపోతే యీ దొంగ వ్యాపారమంతా దెబ్బకు బందవ్వేది.

పోతు : ఇదేం, కలంపోటుతో కుదిరేదికాదోయ్:

రాము : కలానికెలా కుదురుతుంది. ఏ ఒక్క ఆడది చీపురు పట్టుకున్నా కుదురుతుంది.

పోతు : దొంగవ్యాపారంచేసేవాడికి వురేసినా పాపంలేదంటున్న ప్రభుత్వాన్ని ఆడదానితో జమకట్టావన్నమాట !

రాము : ఆఁ !—ఒక్కడికురేస్తే వాళ్ళు తిక్కకుదిరేది.

పోతు : ఓరి వెధవా ! పెద్దపెద్దనాయకులంతా దద్దమ్మలనుకున్నావా ?

రాము : ఛా ! ఛా ! ఎంతమాట ! దద్దమ్మలనుకుంటామా ? పొట్టనింపుకునే వినాయకులనుకుంటాంగాని. (పిడులతో లోపలికి వెళ్ళబోతాడు. "చక్" మని జగన్నాధరావు ప్రవేశించి. రాముడు చొక్కాపట్టుకొని)

జగ : (తీవ్రంగా) వెధవ ! నాలుగుపిడులారేసి రాడానికింతసేపే? త్వరగా ఏడు ! (అని లోపలికి గెంటుతాడు. దాలయ్యనుచూచి) ఓ ! ఏమోయ్! ఎంతసేపైంది నీవొచ్చి?

దాల : అరగంటకుపైగా అయిందండి !

జగ : ఏం ?

దాల : తిండిలేక చచ్చిపోతున్నాం. మీరుతప్ప మాకు దిక్కెవరండీ ?

జగ : (పోతురాజుతో) ఏమిటండీ ! ప్రతీవాడూ "చస్తున్నా ! చస్తున్నా !" అనేవాడే—మనమేదో బంగారం తిని బ్రతుకుతున్నట్టు ! వీళ్ళు ప్రొద్దుటనుండీ కష్టపడితే సాయంత్రానికి "టక్" మని పడుతుంది డబ్బు చేతిలో.

ఇక మనమో? చమటోడ్చి కష్టపడుతున్నాం. కానీ మిగలడంలేదు సరికదా! సేల్‌టాక్సులు, ఇన్‌కం టాక్సులూ, వృత్తిపన్నూ, వల్లకాడూ. కప్పెట్టిన శవాన్నికూడా పీక్కుతినే యీ మార్వాడీ వడ్డీలు—వీటితో నిలువునా ప్రాణాలుపోతున్నాయ్! యీ బాధలు వీళ్ళకెలా తెలుస్తాయి?

పోతు: అవునుమరి! పడుతున్నవాడికి తెలుస్తుంది బాధ!

జగ: (దాలయ్యతో) యీ దిక్కూ, మొక్కూ, గొడవ కట్టిపెట్టి అసలువిషయం తేలుద్దూ!

దాల: ఏవో నూలుపోగు లొచ్చాయంటె?

జగ: ఏదీ కార్డు?

దాల: (కార్డు యిస్తాడు)

జగ: (అదిచూచి) అరె! ఆర్నెల్లునుండి అసలు నూలే తీసుకెళ్ళ లేదన్నమాట!

దాల: ఆర్నెల్లల్లో ఒక్కసారేగా నూలువచ్చింది. వచ్చినప్పుడు చేతిలో డబ్బులేక మానేసానండి!

జగ: అందుకే నే చెప్పా! ఆ కార్డు యిక్కడపారేస్తే, ఏదో పనిచేసుకుందువుగానీ అని. అంతా అలాచేసుకోడం లేదూ?

పోతు: అది నీకే మంచిదిగా?

రాము: (నూలుపిడులు తెచ్చి, వాటితోనే, రెండోగుమ్మం లోకి వెళ్ళిపోతాడు.)

జగ : (పోతురాజుతో) ఇదో నాటకంలెండి ! (దాలయ్యతో) సరే ! ఇప్పుడు డబ్బెలావచ్చింది ?

దాల : పెద్దకూతురి చామంతిపువ్వు అల్లుడికి తెలియకుండా తెచ్చా !

జగ : ఆ మాత్రందానికి మొన్నటిదఫే డబ్బులేక మానేసా నంటావేం ? ఏదన్నా మీాకే చెల్లిందోయ్ !

దాల : నన్ను అపార్థంచేసుకోకండి ! డబ్బుంటె (ఎండినకడుపు చూపుతూ) యీా పస్తులెందుకు ?

జగ : సరే, ఇలాయిఁయ్! (దాలయ్య చామంతిపువ్వుయిస్తాడు) సరే ! వెళ్లు ! నీ కొడుక్కిచెప్పి పంపుతానులే !

దాల : కబురుపంపుతారా! (గద్గదకంఠంతో) నూలు పంపరూ?

జగ : ఏదో పంపుతానులే వెళ్ళు !

దాల : జగన్నాథరావుగారూ ? మీా పాదాలసాక్షి ! నా పెద్ద కూతురి దా చామంతిపువ్వు. తమరింకో రకంగాచేస్తే, మా చిన్నదానిలా, దానికాపురమూ, ఎడబాటైపో తుంది. ఇక లోకం నన్ను పిల్లలసౌభాగ్యాన్ని చెరిపిన పాపిష్ఠీఁని తిట్టిపోస్తుంది. ఇక నేను బ్రతికి ఎవడ్నిబాగు చేయాలో ? ఆలోచించండి !... మీారు... మీారు...

జగ : (కృత్రిమంగా చూస్తూ) ప్రా ! సరేలే వెళ్ళు !

దాల : మీా నూలుకోసం కండ్లుపొడుచుకు చూస్తుంటా !

జగ : సరే, వెళ్ళవోయ్ ! (దాలయ్య వెళ్ళిపోతాడు)

రాము : (ప్రవేశించి) అమ్మగారు పిలుస్తున్నారండీ ?

జగ : (విసుగ్గా)అమ్మగారు పిలుస్తున్నారు—వాళ్ళకి పనిలేదు. ఆ నూలుకు రంగేయడం యీపూటతో పూర్తికావాలిరా! అంతె—వెధవకబుర్లు మోయడానికే సరిపోతోంది...కానియ్! నీ యిష్టంవచ్చినట్టుచెయ్! నా పరువుతీసి పందిరేసిందాకా చెయ్!...ఇంతలో ఆ వెధవ మూకలొస్తాయ్...!

రాము : నేనేం ఆలస్యముచేసాను? తిండి తినకుండాకూడా పని చేస్తున్నా!

జగ : తవ్వోడుబిడ్యాంకూడు గట్టెక్కిస్తావ్! వెళ్ళు అ పని చూడు ముందు!

(విసుగ్గా, కూర్చొని, జేబురుమాలుతో విసురుకుంటూ "స్! స్!" అంటూ) అబ్బబ్బ! నా ప్రాణం పీక్కుతినేస్తున్నారండీ! మధ్య మీరు లేకపోతే యీ పాటికి నా కొంప నడేటిలో కలిసిపోయేది.

పోతు : దానికేంలెండి! స్నేహంచేయకే—చేయాలి. చేసానా? ప్రాణానికి ప్రాణంయిచ్చే ఘటమనుకోండిది!

జగ : తప్పకుండా...ఆఁ! అన్నట్టు - అది మనవలలో పడడం లేదండీ! వాలిగాడి కార్డూ, చామంతిపువ్వూ, గుప్పెట్లో పెట్టుకుందందుకే.

పోతు : (కష్టంగా) మీ వలలో పడ్డానికి అదేం? చేపా?... యీ విషయంలో మాత్రం మీతో నే నేకీభవించలేనండీ!

జగ : ఓహో! పోతురాజుగారు కొత్తగామాట్లాడుతున్నారే?

పోతు : ఇది ఎవడైనావింటె ఏమనుకుంటాడు?

జగ : అహ్హాహ్హాహ్హా! గురువుగారూ! తుమ్మెద చూడండి! తాకినదాన్ని తాకకుండా ప్రతీపుష్పమకరందాన్నీ ఎలా ఆస్వాదిస్తుందో—అంత్లే మనమూనూ.

పోతు : ఆ విషయమిక వొదిలేయండి!

జగ : పోనీలెండి! (రాముణ్ణి పిలుస్తూ) ఒరే! రాముడూ? (రాముడు వస్తాడు) రెండు "టీ"లు తీసుకురా. (రాముడు వెళతాడు) ఆఁ!...ఆ వెధవమూకంతా పోయిందాండీ?

పోతు : అదేమిటండోయ్! మనమాటంటె బ్రహ్మాస్త్రంలా పనిచేయాల్సిందే!

జగ : సెభాష్! యీ నూలెలాగో. ఇంకోగంటకు బండెక్కిపోతుందనుకోండి!

పోతు : ఎలాచేస్తారో? అప్రతిష్టపాలుగాకుండా చేయండంతే!

జగ : మరేం ఫర్వాలేదు.

రాము : ("టీ" తెచ్చి) పనై పోయిందండి. నే నింటికి వెళ్లొస్తా!

జగ : సరే! (రాముడు చేతులు నలుపుతో నిలబడతాడు) సరే! వెళ్ళరా!

రాము : (నసుగుతూ) మిమ్మల్ని ఓ విషయం అడగాలి.

జగ : ఒకటేమిటి? పదడుగు. ఇప్పుడేమైనా అడగడం మానేస్తున్నావనా?—ఏం?

రాము : నాకు జీతం చేయూలండి!

జగ : పుట్టింది — నీ పుర్రెలోకూడా...

రాము : ఎలాపుట్టను చెప్పండి! రెండురోజుల్నుండి మాఅక్క-కూ, బాబుకూ అసలు తిండేలేదు. నా ఒక్క-కడుపుకు మీా రేదో పెడుతున్నారు. జీతంచేస్తె — వచ్చేదానిలోనే కలో, గంజో కలిపి త్రాగుతాం. మీారీకష్టసమయంలో కాపాడకపోతే...

జగ : (తటాలున కుర్చీలోంచి లేచి) కాపాడుతాం. కాపాడం? జీతం లేదు, గీతం లేదు. ఆ రెండుపూట్లా తిండికంటె, నే నెక్కు-వయిచ్చేది లేదు. నీ యిష్టమైతే పనిచెయ్!— లేకపోతే పో!

రాము : మీా రలాకసిరితే నేనేం చెప్పగలను. (ఏడుస్తూ) తిండి లేక నా తండ్రి చనిపోతే, మా గతేంకాను?

జగ : తలమాసిన తండ్రికి ఓ గతిమాలినకొడుకుని బయలుదేరావ్!

రాము : ఎంతతలమాసినా నా తండ్రి చస్తుంటె కొడుకునై వుండి చూడగలనంటారా? (విచారంతోనే—కాస్సేపాగి) పోనీలెండి! మా బాబుకార్డుకు నూలైనా యిప్పించండి!

జగ : నూలు లేదు, గీలూ లేదు—పో!

రాము : నూలు లేదంటారేం? యీా నూలంతా అందరికీ పంచవలసిందేగా?

జగ : పంచుతారు—మన బాబుగారిసొమ్ము! పోరా!

రాము : మీ రలా చేయకండి ! యీ మాటవింటె మా నాన్న యిప్పుడే గుండాగిచస్తాడు. ఆ నూలుకు మా అక్క చావునుంచి తిప్పుక్కొ తెచ్చి యిచ్చాడండి !

జగ : తెస్తే - బాకీ ఎవడిసొమ్మురా ?

రాము : ఎలాగైనా నా నూలిప్పించండి ! మీ కాళ్ళమీద పడతా ! (పడతాడు).

జగ : ఛీ ! (అని కాలితో త్రోసేస్తాడు)

రాము : (లేచి, మంటగా) నా చేతులు మీ కెంతలాభం సంపాదించి పెట్టాయో కూడా గమనించలేకపోయారు.

జగ : ఏడిశావ్ ! వ్రేలుడంతలేవ్ ! నా కెదురు మాట్లాడు తున్నావే ?

పోతు : పట్టుమని పన్నెండేళ్ళు లేవుగదా ! జీతమిచ్చి నిన్నెవడు పెట్టుకుంటాడురా ?

రాము : మిమ్మెలను పెట్టుకోమనలేదు.

జగ : కండ్లు నెత్తిమీదికొచ్చి మాట్లాడుతున్నావేం ?

రాము : (తెగించి) ఎవరు మాట్లాడుతున్నది ?

జగ : ఛీ! బయటికి పో !

రాము : పోతాను. కాని ఒకటి ఆలోచించుకోండి ! మీరు నూలుకు ఎంతమంది పేదల చిక్కటిరక్తంతో ఎర్రటి రంగేసుకొని బ్లాకులో అమ్ముకుంటున్నారో ?

జగ : అంతవరకూవచ్చిందీ ! పో ! వెధవ ! ముందుబయటికి పో! (త్రోయబోతాడు.)

రాము : నేనే పోతాను... మీరు త్రోయడమెందుకు? (వెళ్ళి పోతాడు.)

జగ : (పచారుచేస్తూనే) తిన్నయింటికి వాసాల్లెక్కేట్టే వెధవలు! అందుకే వీళ్ళకు కూడుపుట్టదు.

పోతు : పోనిస్తురూ! ఆ పెంకివెధవగురించి మనకెందుకు? రండి! కూర్చోండి!

జగ : ఏం కూర్చోడమండి! (ఆగి "టీ" చూచి) అరెరె! చల్లారిపోతోందే : ముందుతీసుకోండి! (కప్పులు ఎత్త బోతారు. (లోపల "తమ్ముడూ!...తమ్ముడూ!..." అన్నకేకలు. కమలగుండె బాదుకొంటూ, వొగుర్చు కుంటూ, పరుగెత్తుకుంటూ ప్రవేశిస్తుంది. చటుక్కున జగన్నాధరావు లేచి) ఓ! కమలా? రా రా! ఎందుకా ఏడుపు? రాముడిప్పుడేవెళ్ళాడే?

కమ : మిమ్ములను పితృభిక్ష వేడుదామనివచ్చా! నా తండ్రి ఆకలితో స్పృహతప్పి పడిపోయాడు. మందుకైనా దమ్మిడీలేదు. మీ రెలాగో పుణ్యంకట్టుకోకపోతే—మా బాబు చచ్చిపోతాడు. (జాలిగాచూస్తూ) జగన్నాధ రావుగారూ?

జగ : (సవతితల్లిప్రేమతో) అయ్యో! కమలా! దాలయ్యకంత ప్రమాదమొచ్చిందా? ఇప్పుడే వెళ్ళాడే?... రా! కూర్చో! కంగారుపడకు. కమలా? నీ బాబుకేమీ

ఫర్వాలేదు. నేనున్నానుగా ? (అని భుజంపై చేయ్యేసి కూర్చోబెట్టబోతాడు. కమల కూర్చోదు)

పోతు : మళ్ళీవస్తా ! నాకు సెలవిప్పించండి ! (వెళ్ళిపోతాడు)

జగ : (ఆత్రుతతో నెమ్మదిగా) అలాగేవెళ్ళండి! (అని వెళ్ళిపోతున్న పోతురాజునుచూచి, వినమ్రవ్యతో) లక్కపిడత (కమలతో) చూచావా ? ఎంతమంది దాసానుదాసులై నా కాళ్ళవద్దపడివుంటున్నారో ? నీ వలాపడివుండక్కరలేదు. నీకే నాపై సర్వాధికారం ! రా ! కూర్చో ! నీ క్కావలసింది—దెబ్బలాడి తీసుకో! నీకు నా హృదయం లాయలాసాలేని కైలాసం కమలా ! ఒక్కసారి యీ గుండెలపై చెయ్యేసిచూడు !— నీ నామాన్నే జపిస్తూ ఎలాకొట్టుకొంటున్నాయో తెలుస్తుంది.

కమ : (బిత్తరిచూపులతో) ముందు మాబాబు మందుకేమైనా యిప్పించండి ! లేకపోతే...?

జగ : మరేంఫర్వాలేదు కమలా ! నీ కోసం చూచి, చూచి నా కండ్లు కాయలుకాచిపోయాయ్ ! (కమలచేతులు పట్టుకొని) ఆహాహా! తామరతూండ్లులాంటి నీ మృదు హస్తాలూ. (చేయి ముఖంమీాదికిపోనిస్తూ) చెక్కుటద్దాల్లాంటి నీ చెక్కిళ్ళూ...

కమ : (కాస్తవెనక్కితగ్గుతూ) ఏమిటిదంతా ?

జగ : వెయ్యిఅను! నీవు నన్ను కాలితోతన్ను—అయినా ఆ

పాదాలు నన్ను ముద్దుపెట్టుకుంటున్నట్టుగానే తలుస్తా! ఏమైనా నిన్ను వొదిలిపెట్టలేను కమలా !

కమ : మా బాబక్కడ చస్తుంటె, మీ రిలా మాట్లాడడం ధర్మమా?

జగ : పిచ్చిదానా? ప్రేమకా- సమయాసమయాలు?

కమ : ప్రేమ! మీరా నన్నుప్రేమించేది? ప్రేమబలకబోసి చేసుకొన్న మీ భార్యకు యిది ద్రోహంకాదా? యిందుకా నన్ను కూర్చోమన్నది? ... అయితే నన్ను వెళ్ళిపో నివ్వండి! (వెళ్ళబోతుంది)

జగ : (అడ్డువెళ్ళి) నిన్ను వెళ్ళనివ్వను!

కమ అడ్డులేవండి! (ఏడుస్తూ) నన్ను పోనీయండి !

జగ : కమలా! నిన్ను నేను వొదిలివెడతా కాని నీకై తపించి తల్లడిల్లిపోతున్న యీ నా మనస్సు—నిన్ను వొదిలిపెట్టలేదు...నా కెంతో డబ్బుంది...నాతోకూడి యీ సంపద పంచుకో!

కమ : ప్రేమ యిలా స్వార్థాన్ని కోరదు—అదికోరేది త్యాగం. తప్పుకోండి! నన్ను పోనీయండి! మీడబ్బు నా కక్కర లేదు. ముందు నాతండ్రిని రక్షించుకోనివ్వండి! (పిగిలిన గద్గదకంఠంతో) లెండి! అడ్డులెండి! (త్రోచుకొని వెళ్ళబోతుంది)

జగ : (బలవంతంచేస్తూ) హాహ్హాహ్హా! కాళ్ళదగ్గరకొచ్చిన

దాన్ని తన్నుకునే మూర్ఖుడుంటాడా? నామాట విను! (చేయిపట్టుకొని బలవంతంచేస్తుంటె, కమల గోలెడు తుంది. ఆనోరు నొక్కేసి) అల్లరిచేసావంటే చెడతావ్ జాగ్రత్త! (మరీబలవంతంచేస్తుంటాడు. కమల పెద్దగోల చేస్తుంది. బయట జనంగోల. ఆ జనం జగన్నాథరావు ఇంటివైపువస్తున్న ధ్వని. కమలను జగన్నాథరావు గదిలోకి తీసుకుపో ప్రయత్నిస్తాడు. కమల విడిపించుకొని పారిపోతుంది. జగన్నాథరావు బయటికివెళ్ళి) వెధవముండ! అంతవాళ్లు తెలియనిస్థితిలోవుంటె పెండ్లి చేసుకు ఏడవకూడదూ? "ఒరేయి! ముఖలింగం! బసవలింగం, పట్టుకోండిరాదాన్ని?" ("పట్టుకోండిరా! పట్టుకోండిరా!" అన్న కేకలు) (జగన్నాథరావు నవ్వుకుంటూ స్టేజిమీదికివచ్చి) హాహ్హాహ్హా! ఇదింకెక్కడికిపోతుందో చూస్తా! వస్తే - మన బావాకు పంజరంలోకి, లేదా?—యమపంజరమే! (అని త్రుళ్ళి) హాహ్హాహ్హా! ఇక నెత్తీ, నోరూ కొట్టుకున్నా, దీనిమాటెవడూ నమ్మడు. హాహ్హాహ్హా! (అని మీసాలు దువ్వుతూ వెళ్ళిపోతాడు.)

—: తెర :—

# 4

(దాలయ్యయిల్లు—రెండవరంగంలాగే దాలయ్య లోపల నుంచి, మంచినీళ్ళగ్లాసు పట్టుకొని, తూలిపోతూ, నీళ్ళు త్రాగబోయి గ్లాసు వొదిలేస్తూ "హా! ఆకలి!... కమలా...!" అంటూ తూలిపోయి మంచంపై పడిపోతాడు. ఇంతలో ఏడుస్తూ రాముడు ప్రవేశం)

దాల : (చూచి) ఎందుకురా, ఆ ఏడుపు?

రాము : ("బేర్" మంటూ) పనిలోంచి పొమ్మన్నాడు నాన్నా !

దాల : పనిలోంచే?...(ఆయాసంలో గద్గదకంఠంతో) వింటావురా..." ఆకెళ్ళి కంచెమీదపడ్డా, కంచొచ్చి ఆకుమీదపడ్డా, ఆకుకే నష్టంరా" అంటె వింటావ్ ?

రాము : పనిలోంచి పొమ్మనడమేకాదు నాన్నా ! నూాలు లేదన్నాడుకూడా !

దాల : ఆఁ !...ఆ కార్డూ, చామంతిపువ్వైనా ఇచ్చేసాడా ?

రాము : వాడిస్తాడా ?

దాల : ఆరిభగవంతుడా ! ఎన్నికష్టాలు తెచ్చిపెట్టావ్ ! (అని పడిపోతాడు) (నేపథ్యంలో "ఆ మాత్రం అదుపాజల్లో పెట్టలేని వెధవ బ్రతికెందుకు ?" "వెధవముండను వూరిమీద వొదిలిపెట్టిన ఆ దాలిగాడ్ని అనాలి." అని గోల.)

(దాలయ్య వొణికిపోతూ లేచి) ఎవరిగురించామాటలు?
(కంగారుగా) రాముడూ...! వెళ్ళురా! అదేమిటో కనుక్కో...! (రాముడు వెళతాడు. దాలయ్య తప్ప టడుగులు వేస్తుంటాడు)

రాము : (బయటకెళ్ళిన రాముడుముఖంపై ఎవరో థూస్తూ "థూ! వెధవ అక్కగారిని సంపాదించావ్ ఎలాగైతే!" అంటారు. రాముడు కాళ్ళీడ్చుకుంటూ ప్రవేశించి) వెధ వక్కగారిని సంపాదించానా?

దాల : (వస్తున్న రాముడ్ని పట్టుకొని, ఒగురుస్తూ) ఏమిటిరా! అలా వాలిపోయి వస్తున్నావ్?

రాము : వెధవక్కగారిని సంపాదించానట! (ఏడుస్తూ, తల వొంచుతాడు)

దాల : (రాముడ్ని కదలిస్తూ) అక్క ఏంచేసిందిరా? మాట్లా డవేంరా? ఇలాపిలరా దాన్ని! (అలసటతో) యీ లోకం మనల్ని విరోధులుగా చూస్తున్నపుడు దానికి దూరంగావుండడమే మంచిదికదరా! అసలు బయట కెందుకెళ్ళిందిరా! పిలరా దాన్ని!...ఓయ్! సాంబ శివా! నిన్నంతా దీనజనబాంధవుడవంటారే? మామీద నీకెందుకు దయలేదయ్యా? అంత నీకు పరీక్షించాల నుంటె, నోరులేని యీ పశువులమీద దెందుకయ్యా! ఇదిగో! నాకమల వెధవత్వానికి...అన్నింటికీ కారకుడ

నైస నా మీద—నా ఎముకలగూడు మీద నీ త్రిశూలం ప్రయోగించవయ్యా!...(ఆకలినొప్పివస్తుంది. కడుపుపట్టుకొని) అమ్మా! ఆకలి! (అని మంచంపై పడిపోతాడు.)

రాము: అక్కా!... అక్కా...! కమలక్కా...! (అని పిలుస్తూ, ఇల్లంతావెదకి) అక్క ఇంట్లోలేదే?

కమ: (జుట్టూ, బట్టా, చెదిరివుంటాయి. "నాన్నా! నాన్నా!" అని అరుస్తూ ప్రవేశం)

రాము: (కమలనుపట్టుకొని) అదేమిటక్కా! అలావున్నావేం?

కమ: (విడిపించుకొని) నాన్నా! (అని తండ్రిపై పడబోతుంది)

దాల: ఆగు! దూరంగావుండు! చూడు! పేటా - వాడా ఎలామోగిపోతోందో?...ఏంచేసావో, చెప్పు?

కమ: (తండ్రిపాదాలపై బడి) మీ పాదాలసాక్షి! నీవు స్పృహలేకపడిపోతే సహాయానికి ఆ జగన్నాథరావువద్దకు వెళ్ళానంతే. వాడక్కడ నన్ను బలవంతంచేస్తే విడిపించుకువచ్చానంతే!

రాము: అంతేఅయుంటుంది నాన్నా! డబ్బుకు అమ్ముడుపోయిన యీ లోకంమాటలు లెఖ్కపెట్టకు నాన్నా! అక్క పవిత్రమైంది నాన్నా!

కమ: నాన్నా!

దాల: ఛీ! ఎందులోనన్నా దిగి చావలేకపోయావ్? లేక

నేను చచ్చాకన్నా అలాచేయలేకపోయావా ? (దగ్గు తెర వస్తుంది)

కమ : (తండ్రిని పట్టుకుంటుంది).

[జగన్నాధరావు, పోతురాజూ ప్రవేశం.]

జగ : బాగా చెప్పేవోయ్ ! దాలయ్యా !

దాల : (దగ్గుతూనే) ఎవరుబాబూ ?

పోతు : మన జగన్నాధరావుగారోయ్ !

దాల : (దగ్గుతూ) బాబూ ! మీ పెద్దలకూ, మీకు ఎంతో పుణ్యముంటుంది. నే నిక బ్రతకడంకష్టం. ఏదో కాస్త నూలై నాయిస్తూ, యీ దిక్కులేని పక్షులను కాపాడాలి బాబూ ?

జగ : దిక్కులేనోడు దిక్కులేనట్టు పడుండాలి. అంతేకాని... వెధవ...ఏంచేసాడో - అడుగు !

దాల : ఏమిటిరా, యీ గొడవ ?

రాము : ఏమో ?

జగ : నా యింటిలో నూలంతా ఆ వెధవల్కి నీవు పట్టించ లేదూ ?

రాము : ఏ వెధవల్కి ?

జగ : ఇంకే వెధవల్కి ! "నేను నూలు బ్లాకుమార్కెట్టు చేస్తున్నా" నని వెళ్ళావుగా ?

రాము : ఇప్పుడూ అంటాను. ఇంకా గట్టిగాఅంటున్నా. మీరు నూలుదాచి లేదనబట్టె మా బాబిప్పుడు చావుబ్రతు

కులత్తో తన్నుకుంటున్నాడు. ఇంకెళ్ళిపొండి! ఇంకెప్పుడూ మా గుమ్మం త్రొక్కకండి!

జగ : నోరుముయ్! ఎవడిదిరా యీ గుమ్మం? మీరే ముందు బయటికిపొండి! యీ యిల్లునాది.

రాము : (తీవ్రంగా) ఇది నా ఇల్లు. మేం కదలం! ఏంచేసుకుం టావో చేసుకో!

పోతు : ఒరేయ్! రాముడూ! ఏదో "బాబూ, నాయనా!" అని కాళ్ళూ చేతులూ పట్టుకోక దబాయిస్తావేమిటిరా? నీలాఅయితే యీపూళ్ళో ఇక మేం బ్రతకక్కరలేదు... మనది పాతికేండ్ల సర్వీసు తెలుసా?

రాము : (వ్యంగ్యంగా) ఆఁ! ఆముదం మొక్కకుంది. భూమి పుట్టినప్పటినుండీ సర్వీసు! ఎందుకు? ఎలక్ట్రిక్ దీపం దాని తెగులణిచింది.

జగ : (ఎగురుతూ) ఛీ! ముందు బయటికిపొండి!

రాము : (దీనంగా) ఇలాఅయినా మమ్మల్ని బ్రతుకనివ్వండి! (ఆవేశంతో) మీకు మేం ఏం అపకారం చేసాం? మా డొక్కల్ని మాడ్చుకొని మీ పొట్టల్లో పాయ సాన్ని పోసాం! ... మీ త్రోవకేం అడ్డొచ్చాం? మా రెక్కలకష్టాన్ని మీకు ధారబోసాం! మా చిక్కటి రక్తంతో మీకు బంగారంముద్దలుచేసిపెట్టాం! హాయిగా ఆనందాన్ననుభవిస్తున్నారు. (దీనంగా మమ్మల్నిలా వొదిలిపెట్టండి!

దాల : బాబూ ! జాలిచూపండి ! (దగ్గు తెరవచ్చి పడిపో బోతాడు.)

కమ : నాన్నా ! (తండ్రిని పట్టుకొని, జగన్నాధరావుతో) యీ మా తండ్రి దీనావస్థను చూచైనా కనికరించండి! జగన్నాధరావుగారూ ?

జగ : కనికారం ! ఎన్నాళ్ళని కనికరించడం ? చచ్చినతర్వాత తీరుస్తారా ? బాకీ ?

దాల : మీ ఋణంతీర్చే చస్తానుబాబూ !

రాము : ఋణం. (ఏడుస్తూ) గుండెలపై చెయ్యేసుకు చెప్పండి! యీ ఋణానికి కారణమేమిటో ?

జగ : చెపుతా ! వెధవ ! కమల ముఖంచూ ది ఆలోచించాల్సి వస్తోంది. లేకపోతేనా ?

రాము : లేకపోతే ?

జగ : నాలుగుతన్ని అవతల కీడుద్దును.

కమ : (దీనంగా) వాడితో ఏమిటండి ! నా మాట వినండి! మీయిష్టప్రకారమే ఇల్లుకాళీ చేసి ఏచెట్టుక్రిందకో పోతాం ...యీ వేళకు మమ్మల్నిలా వొదిలిపెట్టండి !

పోతు : మీరిలాఏడుస్తుంటె జగన్నాధరావుగారికి జాలిలేదనా?

జగ : సత్యంచెప్పారు. గురువుగారూ!... ఇక అంతా నీలోనే వుంది కమలా!

రాము : ఏమిటావుండేది? ఆదరించమని యింటికొచ్చిన ఆడ

దాన్ని బలాత్కరించి...ఇంకా సిగ్గులేదేం?

పోతు : (తనకు సంబంధంలేనట్టు ఎదుటికొచ్చి నిలబడతాడు)

జగ : ఏంయ్!

కమ : (కండ్లెర్రచేసి) జాగ్రత్తగా మాట్లాడండి! ఆపదే అణగి వున్నంతనేవే ఏదైనా?

జగ : బాగా ఆలోచించే మాట్లాడుతున్నావా?

కమ : నేనే కాదు. ఇదిగో! యీనా శరీరాన్ని ముక్క, ముక్కలుగా కోసి ఏ ముక్క చెవిదగ్గర పెట్టుకున్నా చెబుతుంది — తుచ్ఛ కామానికి అమ్ముడుపోనని.

జగ : ఏం? దాలయ్యా?

దాల : బాబూ!

జగ : ఏమిరా! రాముడూ? నీవేమంటావ్?

రాము : మర్యాదగా బయటికి పొమ్మంటాను.

జగ : పొమ్మంటావే?

రాము : ముమ్మాటికీ!

జగ : (సాగదీసి చెంపకాయ కొడతాడు)

రాము : అక్కా!

కమ : తమ్ముడూ! (అని రాముణ్ణి గుండెలవద్దకు లాక్కుంటుంది).

జగ : (పోతురాజుతో) పదండి! గురువుగారూ! (వెళ్లిపోతూ, కమలతో ఇల్లు గంటలో ఖాళీచేయకపోతే కూలీల్ని పంపి యీడ్పిస్తా జ్ఞాపకముంచుకోండి! (ఇరువురు వెళ్ళిపోతారు)

దాల : (ఓపిక తెచ్చుకొని, జగన్నాథరావును వెంబడిస్తూ) బాబూ !...మా పేదలపైనా పగ ! (పడిపోతాడు).

కమ : (వెంటనే తండ్రిని పట్టుకొని) నాన్నా ! (తమ్ముడుతో) ఒరేయ్ ! చన్నీళ్ళు పట్టుకురా.

రాముడు : (కమలతోపాటు "నాన్నా" అని కమల నీళ్ళు తెమ్మన్నాక వెళతాడు)

కమ : (తండ్రిని లేవనెత్తుతూ) నాన్నా !

దాల : ఇంక బ్రతికేందుకమ్మా! ఒకప్పుడు పాతికివి స్త్రీలయినా లేవని రోజే లేని మన పండంటి సంసారమా ? — పూటకు పిడికెడు బియ్యం లేనిదై పోయింది. ఒకప్పుడు నిత్యం పదిమగ్గాలైనా ఆడే కొంపా ? — గుల్లయి పోయింది. యీనాడు — నిన్న కాక మొన్న పెద్దవాడైన యీ జగన్నాధరావుతో చెప్పుదెబ్బలు చీవాట్లు తినవలసిన హీనస్థితి కొచ్చాం. ఆఖరికి తరతరాలనుండి కాపురముంటున్న కొంపా — వొదిలిపెట్టవలసి వస్తోంది. ...కమలా !......(దగ్గుతెర !... కమల గాభరాగా పట్టుకొంటుంది.)......ఇక యీ లోకమా ? దొరికిన రాయల్లా మనపైకే విసురుతోంది....(దగ్గుతెర)

కమ : నాన్నా ! (ప్రక్కకు చూచి) త్వరగా, రా, రా ! తమ్ముడూ ?

దాల : పరువు మంటగలిసాక బ్రతికేందుకమ్మా ! (దగ్గుతూ, "ధనా" మని నేల కొరిగిపోతాడు).

కమ : (శవంపై బడి, కదుపుతూ) నాన్నా! మమ్మల్నొదిలి పెట్టి పోయావా? ఆ కరువు మహామ్మారికి తనవల్లకాటికి పండుగచేసుకోడానికి, నీ రక్తం కల్లాపై పోయిందా? నీ ఎముకల భస్మం ఇక ముగ్గైపోయిందా? నాన్నా! యీ బాధ ఎలా భరించాలి? అక్కా! మొగుడితో పోయింది. నీవు బ్రతికున్నంతకాలమూ, బంగారుగుడ్ల బాతును కోసుకుతిన్నట్లు తిన్నారు. దానింటికెళ్లితే ఆదరిస్తుందా? లేదు, నాన్నా లేదు. ఇక మాకు నీతోపాటు చావడంతప్ప గత్యంతరంలేదు. (శవానికి తల కొట్టుకొని ఏడుస్తూ) నాన్నా!

రాము : (గంజినీళ్ళతో ప్రవేశిస్తాడు)

కమ : ("బేర్" మంటూ) నీళ్ళెందుకురా! ఇక నాన్నపై కప్పడానికి ఓ చిన్న గుడ్డముక్క పట్టుకురారా! చాలు!

రాము : అక్కా! నాన్న, చనిపోయాడా? (శవంపై బడి) నాన్నా! (అని "బేర్"! మంటాడు)

కమ : (ఘొల్లుమంటూ) ఇంకెక్కడి నాన్న? (శవంపై పడుతుంది)

[నేపథ్యంలో పాట]

ఇదేనా? జీవితమూ? ఇదా - జీవితమూ?
కోట్లకొలది భారతీయులకు
మానముకప్పిన వస్త్రదాతకే
తిండిలేక - చనిపోయినాక
పైకప్ప గుడ్డముక్కైనలేని దిదేనా॥ జీ॥

కమ : (పాటకాగానే, నెమ్మదిగా లేచి) తమ్ముడూ! ఇక మనకు గత్యంతరమేమిటి ?

రాము : ఏడవకక్కా! పోనీ, అడుక్కుతిందాం !

కమ : (ఏడుస్తూ) అడుక్కునా ?

రాము : మనబోటి అనాథులెంతమంది అడుక్కోడం లేదు ? అదేమీ చిన్నతనం కాదక్కా! మన చేనేతకార్మికులు లక్షలాదిజనం అడుక్కుంటున్నారు. వాళ్ళంతా పరువు తక్కువవాళ్ళు కాదక్కా.

కమ : ఇంత బ్రతుకూ బ్రతికి, ఆఖర్కి భిక్షమెత్తుకోడమా ? నాన్నా! (ఏడుస్తూ) నీ కళ్ళతో—నీ యీ పిల్లలగతి చూస్తే మమ్మల్నన్ని తిడతావో ? నాన్నా! (ఘూర్ల్లు మంటూ మళ్ళీ శవంపై పడిపోతుంది)

రాము : అక్కా! (ఏడుస్తూ, అక్కవీపుపై పడిపోతాడు)

నేపథ్యంలో పాట.

ఝుం! ఝుం! ఝుం! ఝుంకారాలతో
నాట్యమాడే నాడికదములో
గడితేరిన కళాహాస్తమున
లోకాలకొస్త్ర దస్త్రాలనిచ్చిన నేతగానిది॥

కమ : (నెమ్మదిగా ముఖంపై కెత్తి, రాముడుతో) లే! తమ్ముడూ సామాన్నీ, శవాన్నికూడా బయటికి తీసుకుపోదాం. లేకపోతే ఆ జగన్నాధరావు కూలీల్ని పంపి యీడ్పిస్తాడు.

(అని ఇద్దరూ సామాను బయటకు చేరవేస్తుంటారు.)

నేపథ్యంలో మళ్ళీ పాట.

కాంతులీను కళాఖండమున
పెద్దాపురపు పట్టుచీరనూ
ముద్దుగొల్పు వెంకటగిరి జల్లా
ఘంకారమ్రోగిన ఢక్కామజ్లీ
జానిపినట్టి, చేనేతగానిదీ :
రామరాజ్య పరిపాలనలోనిదీ ॥ఇ॥

[సామాను జేరవేయడం అవుతుంది. ఇరువురూ శవాన్ని ఎత్తుకుంటూ నిష్క్రమిస్తోంటే ;]

నేపథ్యంలో మళ్ళీ పాట.

కోట్లకొలదీ భారతీయులకు
మానముకప్పిన వస్త్రదాతకే
తిండిలేక - చనిపోయినాక
పైకప్పు గుడ్డముక్కైన లేకిదేనా॥

(విచారంతో తెర పడుతుంది.)

## 5

[జగన్నాథరావు యిల్లు. పోతురాజు సోఫాలో కూర్చొని పేపరు చదువుతుంటాడు. "ఎలాగోలాగు ఏడుద్దూ!...వెధవ ముండలు మొగుడు బ్రతికుండగా సుఖపెట్టలేరు. చచ్చాకమా

త్రం ఏడుస్తారు." అని భార్యపై కేకలేస్తూ జగన్నాథరావు ప్రవేశం.]

జగ : అంతసమాధానం చెప్పలేనిచవటలు. ఎందుకు నూలు పట్టుకోవాలీ ?

పోతు : ఏడిశారు! ప్రభుత్వం గ్రుడ్డిదనుకున్నారా? చేతకానిదను కున్నారా? దోపిడీని సహిస్తుందా?

జగ : బాగాచెప్పారు. ఇంతకీ మీ రలా పోలీస్ట్షేషన్కు ఫిర్యాదుచేసివుండకపోతే వాళ్ళకుపడ్డ బేడీలు, యీపా టికి మనకే...

పోతు : హే! పాతికేళ్ళ సర్వీసుమనది. మనం తల్చుకుంటె నల్లరాయి బ్రద్దలుకావాల్సిందే! (మళ్ళీ పేపరు చదువ నారంభిస్తాడు).

జగ : (పకాలున నవ్వుతూ) మీరు తల్చుకుంటె అంత్తే అను కోండి! (ఇరువురూ నవ్వుతారు) ఏమిటీ మహాదీర్ఘంగా చదువుతున్నారు పేపరు? ఎలక్షన్ నామినేషన్లగురించా?

పోతు : ఆ విషయంలో నా కెట్టిసందేహమూ లేదండోయ్!

జగ : ఏమిటంత ధైర్యంగా చెబుతున్నారు ?

పోతు : ధైర్యంకాక మరేమిటి? చూడండి! రేపీపాటికి మీ నామినేషన్ ప్యాసై రాకపోతే అందురుగాని.

జగ : అలాఅన్నాను కాని, నాకు మీ శక్తిసామర్థ్యాలపై నమ్మకంలేదనుకోకండి! అందులోనూ మనం మంత్రివర్గ పక్షంలోకి తిరిగిపోయాం...

పోతు : తిరిగిపోయామంటె—తప్పకుండా తిరిగిపోతాం. ఎద్దైనా ఒకమక్కసలిస్తే రెండోమక్కమీదకు మారుతుంది. అలాగే మనమూనూ. ఏ ఎండకాగొడుగు పడుతుండాలి మరీ !

జగ : అవునుమరి! ఇవేం రాజకీయాలా? మాటలా?—అవును గానీ, మనకీ ఎసెంబ్లీఎలక్షన్కు మొత్తం ఎంతఖర్చవుతుందంటారూ ?

పోతు : ఖర్చా? యీ రోజుల్లో మనం ఖర్చుపెట్టాల్సిన అవసరంలేదు. ఎందుకంటారా? ప్రతీవాడూ—"మీరేం చేసారో చెప్పండి!" అని గొడ్డుకొంగుపట్టి అడుగుతున్నాడు. ఇక చేయిచాపేవాళ్ళు, చెప్పకోవాలంటె, బహుతక్కువే! మనకీ గొడవలన్నీ అక్కరలేదు. గ్రామాల్లోనూ, పట్టణాల్లో అయితే పేటల్లోనూ, పెద్దలుంటారుకదండీ? వాళ్ళను పట్టుకుంటె-మనం యింటిలో కాలుమీద కాలువేసుకున్నా గెలిచేస్తాం...ఇంకోవిషయం—యీ పెద్దలకుంది. చూసారూ? గుళ్ళూ, గోపురాలుపేరిట ఏదోకాస్త పారేస్తే—ఇక మనకుతిరిగేలేదు.

జగ : ఇంతకీ ఏ మాత్రం ఖర్చవుతుందంటారూ ?

పోతు : ప్చ్! ఓ పాతిక వేలయితే—ఓ, ఎక్కువనుకోండి!

జగ : అబ్బ! పాతిక వేలే?

పోతు : వెధవపాతిక వేలూ? మొన్న జిల్లాబోర్డు అధ్యక్షపదవి ఎన్నికల్లో ఒక్కోడికీ నాలుగేసి లక్షలయింది.

జగ : అబ్బ! ఇదేమిటండీ? నిన్న మనయింటిలో నూలుపట్టు కున్న వెధవలున్నారు చూసారూ? వెధవ—చిన్న బాకాల తోనే ఎలాపని జరిపిస్తారండీ?

పోతు : ఏడిశారు! వీళ్ళూ వీళ్ళ బాకాలూను. ఏదో గోడల మీద నాలుగు వెధవపోడిముక్కలు "నశించాలి! నశించాలి!" అని రాసేస్తే గెలిచేస్తారా? యీ పీను గులు గెలవడం మీ రెక్కడైనా చూసారూ? ఎక్కడి వరకో ఎందుకు? యిప్పట్కి (నెత్తిమీద వెంట్రుకలు పట్టుకొని) ఇన్ని ఎలక్షన్లు జరిగాయి. ఎందులోనైనా వీళ్ళు గెలిచారూ? అసలు ఎల్లాపనిచేస్తే నెగ్గుతారో, వాళ్ళకేం తెలుసండి! మనల్ని అడగండి! హేఁ! పాతి కేండ్ల సర్వీసు మనది.

జగ : ఆహాహా! (తన్మయుడై) సువర్ణాక్షరాలు సెలవిచ్చా రనుకోండి!

పోతు : మనమింక యిలాకాలక్షేపంచేస్తే లాభంలేదు. నామి నేషన్ప్యాసై రేపొచ్చేస్తుంది...ఇక మీరు ఒకడజను ఖద్దరు తానులయినా తెప్పించి, యీ వేషం మార్చె య్యాలి. జండాలు కుట్టించేయాలి...

జగ : అదేంతసేపండీ?

పోతు : "ఎంతసేవ" ని మీసమేషాలు లెఖ్ఖపెడుతూ కూర్చుంటామా?

జగ : అయితే పదండి! ఇద్దరంకలిసే వెడదాం. ఆ లెఖ్ఖకూడా తీసుకుపోదాం. (లేవబోతారు. పోలీస్ బ్రేడెస్‌లో ప్రవేశం.)

పోలీ : నమస్తే! జగన్నాధరావుగారూ! (పోతురాజునుచూచి) ఓహో! మీరూ యిక్కడే వున్నారే?

జగ : రండి! కూర్చోండి! (అని లేచి గుమ్మంవరకూ వెళ్ళి) ఎవర్రా అక్కడ? మళ్ళీ వెనక్కితిరిగి) కుర్రకుంకలు! సమయానికుండరు.

పోలీ : (ఆశ్చర్యంతో చూస్తుంటాడు)

పోతు : దేనికండి?

జగ : వీరికి కాఫీ తేవడానికి!

పోలీ : ఓస్! అందుకా! అయితే కూర్చోండి! నే నిప్పుడే త్రాగొచ్చా! అన్నట్టు మీ కుర్రోడుండాలికోసమే?

జగ : పోయేడు లెండి వెధవ! తిండెక్కువైతే ఇలాగేవుంటుంది. అందులోనూ వాడు కమ్యూనిష్టు!

పోలీ : అది నాకు తెలుసులెండి! యీ రోజుల్లో జీతం ఎక్కువడిగేవాళ్ళనందరినీ మీలాంటివారు కమ్యూనిస్టుల్లో జమకట్టేయడం సహజమేలెండి! —— ఇంతకీ ఎంతిచ్చేవారు జీతం?

జగ : జీతమా? వాడికి జీతమెందుకండి? ఇంట్లో రెండుపూటలూ అమాంతంగా రెండు శేర్ల బియ్యపన్నం పట్టుపట్టేసేవాడు.

పోలీ : జీతం - రెండుపూట్లా తిండేనన్నమాట!

పోతు : ఆ తిండి లేకచచ్చే దెంతమందండీ?

పోలీ : ఏమిటో ! జీతం లేకుండా యీ రోజుల్లో పనిచేసేవా డెవడులెండి!

జగ : అయినా నేనేం జీతమివ్వనన్నానా?—వాడడిగితేనా?

పోతు : తమరొచ్చినపని చెప్పారుగాదు?

పోలీ : ఆఁ! నిన్నటోళ్ళకి రిమాండిచ్చేసామండి!

జగ : తిక్కణిగింది—వెధవల్కి!

పోతు : పట్టపగలే నూలుదోపిడీ — ఏ ప్రభుత్వం సహిస్తుంది చెప్పండి ?

పోలీ : జగన్నాధరావుగారూ? మీకు యస్. ఐ. గారోవిష యం చెప్పమన్నారు.

జగ : అయ్యొయ్యో! చెప్పండి!

పోలీ : మీ రింకోరకంగా భావించుకోనంటె...

జగ : ఎంతమాట?

పోతు : యస్. ఐ. గారేదిచెప్పినా, మీ కోసమేగదండీ!

పోలీ : చెప్పమన్నారా ?

జగ : ఓ! చెప్పండి!

పోలీ : మీ రిటువంటివ్యవహారాలు తగ్గించుకోవాలన్నారు.

జగ : ఆయనా, అనుమానపడ్డారూ?—అసలానూలు వీవర్స కిచ్చేసినబాపతే. అయితే వాళ్ళు రంగేయమన్నందున నా యింట్లో నిల్వవుంచానంతే!

పోలీ : అయితే వాళ్ళెందుకు పట్టుకొంటారు?

జగ : దొంగిడీగాళ్ళకు—అందుకూ, ఇందుకూ అనేముందండీ?

పోతు : మీ పోలీసుబలహీనత కనిపెట్టి పట్టుకున్నారంటాను.

పోలీ : పోలీసులంటె చేతగాని చవటలనుకోకండి! మేమేం గాజులు తొడిగించుకు కూర్చోలేదు. అసలు మొత కంతా మీలోనేవుంది.

పోతు : జగన్నాధరావుగా రటువంటివారుకాదు—తెలుసాండీ?

పోలీ : ఎటువంటివారైనా ఎన్నికలరోజులు. ఇటువంటి పనులు చేస్తే మీకేదెబ్బ! ఎందుకంటారా? ఇట్టి మీ తప్పుడు పనులను ప్రతిపక్షం ఎరగాతీసుకొని మిమ్మల్ని ఓడించ డానికి ప్రయత్నించేస్తుంది—పోతురాజుగారూ? అన్నీ తెలిసిన మీరే యిలామాట్లాడుతారేమిటి? మీ యిష్టం వచ్చినట్టు చేసుకోండి! మాకేం? యీవేళ మీరు ప్రభు త్వంలోవుండి ఎవర్నితన్నమన్నా తంతాం. రేపు ఇంకొక రొచ్చి మిమ్మల్ని తన్నమన్నా తంతాం ... యేదైనా చట్టాన్ని అక్షరాలా అమలుజరిపే బాధ్యతమాది.

పోతు : అంత్తేఅనుకోండి!

జగ : తమకు కోపం కలిగించినట్టున్నామే?

పోలీ : ఒకడు కలిగిస్తే, కలిగేదేముందిలెండి! మా యస్. ఐ. గారు చెప్పమన్నారు—చెప్పాను. తరువాత మీ యిష్టం! ...సెలవ్!

జగ : వెళ్ళిపోతున్నారా? (పోలీసును ఆపుచేసి, జేబులో పది రూపాయల కాగితంతీసి) యివి తాంబూలం ఖర్చు కుంచండి!

పోలీ : (తీవ్రంగా) ఏమిటీ? (ఓక్షణమాగి) లంచమా?

పోతు : మీరలా అనుకుంటారనే, మేం సంతోష పెట్టలేక పోతున్నాం.

పోలీ : నే నేననుకోడం కాదు. ఇది విన్న తలకాయున్న ప్రతీ వాడూ అనుకుంటాడు. అందులోనూ మా పోలీసు లంటే లంచాలు మేసే గకాలని ప్రతీవాడికీ లోకువే!- అలా అనుకున్నవాడికి విషయం తెలీదనుకోండి! ఎందు కంటారా? మా పోలీసుల్లోనైనా ప్రతీవాడూ లంచం పట్టడు. — కుచేల సంతానంతో కుమిలిపోతున్నవాడు తప్ప! వాడ్ని దరిద్రం తరుముతోంటే, లంచం పట్ట కుండా ఎలావుంటాడు చెప్పండి! వెధవ యాభై రూపా యలతో ఎలా బ్రతుకుతాడు? (తీవ్రంగా) పోతురాజు గార్లూ? ఆదర్శప్రాయులుగా వుండాల్సిన మీరే యిలా మప్పడం మంచిదికాదని మాత్రం మనవిచేస్తున్నా!... మరి సెలవ్! (వెళ్ళిపోతాడు)

జగ } హాహాహాహా! అమాయకుడు!
పోతు } వాహావా

పోతు : పోనీలెండి! ఏదిమిగులు! అంత్తేగా?

జగ : బాగా చెప్పారు. (యిరువురూ మాటలకుద్యుమిస్తారు)

పోతు : పాపం ! ఆ దాలయ్య చనిపోయాడట తెలుసా ?

జగ : రోజు కెంతమంది చావడంలేదు. చచ్చినోళ్ళందరికోసం ఏడిస్తె, ముందు మనం చచ్చి వూరుకుంటాం. సరే ! ఎవడు చస్తె మనకేం ?... ముందు యిది చూడండి !

(పేపరు చూపుతాడు)

[నేపథ్యంలో, రాముడూ, కమలా భిక్షమెత్తుకుంటూ, పాట పాడుతుంటారు]

బాబూ ! అనాధులమూ, బికారులమూ ;
కర్మకాలి ఒక రాగికానికై
చేయి చాపుచూ ముష్టివాళ్లనూ
కనికరించి, కాపాడండీ ! (పాట ఆగుతుంది)

పోతు : (బిక్షుకుల ధ్వని విని, జగన్నాథరావుతో) విన్నారూ ! ఆ పాట ! ముష్టికొచ్చి మీసాలు త్రిప్పినట్టు — కర్మకాలి వచ్చారట ! రాగికానీ వేయాలట !

జగ : పోనిద్దురూ ! ముష్టిముండాకొడుకులు ! (పేపరు చూపిస్తూ) ఇటు చూడండి !

రాము } బాబూ ! దిక్కులేని పక్షులం ! ధర్మంచేయించండి !
కమ } (నేపథ్యంలో)

జగ : (అటువైపు చూస్తూ) పోతారా ? పోరా ?

రాము : ఎంతో ఆశపెట్టుకు వచ్చాం బాబూ ! (నేపథ్యంలో)

జగ : మీ బాబు సొమ్మిక్కడ దాచిపెట్టావురా వెధవ ! ఫో ! ఫో !

కమ : మూడు రోజులనుండి కడుపు కాలిపోతోంది బాబూ

(నేపథ్యంలో)

జగ : పోయి, పెంటమీద గడ్డి కూరుకోండి !

రాము } ఆహా ! ధర్మప్రభువులు !
కమ } (నేపథ్యంలోనే పాడుకుంటూ వెళతారు)

కాలే కడుపుకు గడ్డికూరమనే ;
ప్రభువుల్లారా ! మావినతీ !
మీా సంపదలు — మా రక్తమే
మీా వెనక్కి తిరిగి చూడండీ ! ॥ బాబూ॥

జగ : ("చల్" మని లేచి) అరె ! పరిచయమున్న గొంతుల్లా వున్నాయే ?

పోతు : (చేయిపట్టి) పోనిద్దురూ, వెధవలు ! వీళ్ళతో పెడితే పెండ్లి, లేకపోతే చావునూ.

జగ : వుండండీ ! వాళ్లెవరో తప్పకుండా పరిచయమున్నవాళ్లే ! ("రయ్ !" మన బయటకెళ్లిపోతాడు)

పోతు : (విసుగ్గా) వెధవలు ! 'పానకంలో పుడకల్లా' వచ్చి ప్లానంతా తల్లక్రిందులు చేసేశారు......(అనుకుంటూ వెళ్ళిపోతాడు)

— తెర —

# 6

[సాదా సీను-రాముడూ, కమలా, బిచ్చాటనలో ప్రవేశిస్తారు పాట పాడుతూనే]

బాబూ! అనాథులమూ, బిఛారులమూ ;
జాలిగుండెల బాబుల్లార !
దిక్కులేని పసిపక్షుల జోడూ
గంజికైన ఒక కానియిమ్మనీ
అడుగుతోంది, బిచ్చా !...॥ అ॥

కమల : (ఆవేదనతో డొక్క ఎగరేస్తూ) అమ్మయ్యా ! తమ్ముడూ ! ఇంకిలా బ్రతకడంకంటె చచ్చిపోవడం మంచిదిరా!

రాము :(దీనంగా) ఎందుకే తమ్ముడూ ? ... వెధవ తమ్ముడు ! నిన్ను బిచ్చానికి త్రిప్పుతున్నాడు.

కమ : తమ్ముడూ ! (అని పడబోతుంది)

రాము : (క్రిందపడకుండా పట్టుకొని) అక్కా ! ఇంతలోనే నీకేమైందక్కా !...అక్కా ! (ఇంకా గట్టిగా) అక్కా! (ఓనిముషం, కమలవైపు దీనంగా చూస్తాడు)

కమ : (కొంచెం తలెత్తి) దా...హం...! (అః సొలిపోతుంది.)

రాము : దాహమా ! (అని అటూ ఇటూ పైకి చూచి) ఇదిగో ! ఇప్పుడే తెస్తున్న ! (అని క్రింద పడుకోబెట్టి వెళ్ళిపోతాడు. రెండు నిముషాలు గడుస్తుంది)

కమ : రా...ము...డూ...! దా...హం...! (క్షణమాగి) తమ్ముడూ...! మంచినీళ్ళు !

రాము : (కొబ్బరి బొండంతో "రయ్" మని ప్రవేశించి, ఆ బొండాం, "థఢ్" మని రాతిపై కొట్టి) ఇదిగో, తెచ్చా ! ఇదిగో !

కమ : మంచినీళ్ళా ? (ఆత్రుతతో) ఏవీ ?

రాము : (ఆ బొండాం, నోటికి కరిపిస్తూ) ఇదిగో !

కమ : (గబగబా గుటకలు వేయబోతుంది. నీరు ఎగతన్నడం వల్ల ముక్కురంధ్రాలగుండా ఆ నీర్బొచ్చి, దగ్గుతుంది

రాము : (కమలను పార్శ్వానికి లాక్కుంటూ, గుండెలు రాస్తాడు. ఓ క్షణం గడుస్తుంది. నీరు త్రాగించి, త్రాగాక ఆ బొండాం బయట పారేస్తాడు)

కమ : అమ్మయ్యా ! ఒక్కనిముషం ఆగితెచ్చినా నాలుక లాక్కుపోను. అలా ఎందుకు చేయలేకపోయావ్ ? తమ్ముడూ !

రాము : అలా నిరాశచెందకక్కా ! మనకు మంచిరోజులు తప్పకుండా వస్తాయి...చీకటి ఎంతకాలముంటుంది ?

కమ : మంచిరోజులు. అవన్నీ డబ్బున్నవాళ్ళకేరా? మనకు మాత్రం అన్నీగడ్డురోజులే. (ఏడుస్తూ) నీవు చూచేవు కదూ ! "ఒక్కకబళంబాబూ!" అంటె కన్నుకొడు తున్న యీ లోకంలో ("బేర్" మంటూ) బ్రతకడ మెందుకు, తమ్ముడూ?

రాము : అలా నవ్వుకొనేటివాళ్ళే కాలు కామాంధులక్కా! వాళ్ళకు తల్లీ, చెల్లెలు అన్న బేధంవుండదు. ఆఖరికి తల్లినికూడా తార్చడానికి శంకించని చవటలేఅక్కా! ఏనుగు వీధిని పోతుంటె, ఎన్ని కుక్కలు మొరగవ్?

కమ : ఇక నీవు నన్ను సముదాయించలేవురా! పెద్దక్కయింటికిపోయి, దానికివెట్టిచేసైనా బ్రతుకుతాను కాని, యీ భిక్షాటన చేయనురా.

రాము : అది నిజంగా కనికరంగలదైతే నాన్న చనిపోయేవాడా, అక్కా?

కమ : అయితే నన్నుఎందులోనన్నా త్రోసెయరా! (ఏడుస్తుంది)

రాము : అక్కా! (ఆవిడతల గుండెలకత్తుకుంటూ) ఇదిగో! (పాదాలపైకి జారుతూ) నీ పాదాలసాక్షి! ఇక నిన్ను భిక్షమెత్తనివ్వను. నేనే భిక్షపట్టి నిన్ను పోషిస్తా! నీవు నాకు కాస్త గంజికాసిపోయి, చాలు! (ఎర్రగా, ఎదుటికిచూచి) నన్ను అనాధుణ్ని చేసిన యీ లోకం నాకెందుకు ధర్మంచెయ్యబోచూస్తా!...ఇక నీవు ఏడవకక్కా!

కమ : (రాముడు ముఖాన్ని రెండుచేతుల్లోకి తీసుకొని) ఎంత జాలిగుండెరా నీది? (అని కౌగలించుకుంటుంది)

రాము : అక్కా! (అని కమల కౌగిలిలో తన్మయుడై పోతాడు

[డ్రెస్‌లో పోలీసు-బయటనున్న కొబ్బరిబొండాంతో ప్రవేశం.]

పోలీ: అక్కా!...అక్కా లంజా! తమ్ముడు దొంగానూ.

కమ: (ఒక్కసారిగా, వెనక్కితిరిగిచూస్తూ) ఎవరు?

రాము: ఎవడిదా ప్రేలాపన?

పోలీ: ఎవడా? (ముందుకెళ్ళి రాముడు జుట్టుపట్టుకొని) వెధవ! యీ కొబ్బరిబొండా ఎక్కడ దొంగిలించావో? చెప్పు!

కమ: దొంగతనమా?

పోలీ: (హుంకరిస్తూ) కాదేం?

రాము: కాదక్కా! నీవు స్పృహతప్పిపడిపోతే, జగన్నాథ రావు దొడ్డిలో చెట్టునుండి ఒకటి తెచ్చానంతే!

పోలీ: ఒకటా! వెధవ! దొంగోడిలక్షణాలన్నీవున్నాయ్! స్టేషన్కు లాక్కుపోయి ప్రక్కలిరగతంతే, ఒకటో, పాతికో తేలుతుంది!

కమ: అయ్యా! నా తమ్ముడలా దొంగతనంచేసేవాడుకాదండీ!

పోలీ: ఇంకేం? గంతకుతగినబొంత! బొంతకుతగిన గంతానూ... ఇది దొంగతనంకాదేం?

కమ: (తమ్మునితో) ఎందుకు చేశావురా యీ పని? ఇదో నిందా మనకు? నేను స్పృహతప్పిచస్తే, యీ భూమికే బరువు తగ్గిపోనా? ఎందుకు తెచ్చావురా, కొబ్బరికాయ?

రాము: అక్కా! నీ చావుకంటె, యీ కొబ్బరికాయెక్కువా? ఇది దొంగతనమా?

పోలీ: ఇంకా డబాయిస్తున్నావేం? (కొడతాడు)

కమ: పోనీ దొంగతనమే! ... క్షమించండి! నా తమ్ముడిం

కెప్పుడూ ఇటువంటిపనులు చెయ్యడు !

పోలీ : చేసింది——తుడిచేసుకుంటె చెరిగిపోతుందే? ఇదేం ప్రభుత్వమనుకున్నావా? యీ చట్టాలేం, తాటాకుముక్కలనుకున్నావా? పదరా! వెధవ! (అని రాముడ్ని లాక్కుపోతుంటాడు.)

కమ : (వెంటాడి) జవానుగారూ! యీ సారికి క్షమించండి! వాడ్ని వొదిలిపెట్టండి !

పోలీ : వీల్లేదు! పద, పదరా వెధవ! నాలుగుతంతేనేగాని నే కెవి తగ్గవ్ !

కమ : (ఎదుటికొచ్చి) ఆగండి! ఒకకొబ్బరికాయ దాహానికి తెచ్చుకుంటేనే తప్పయితే——ఆ తప్పు నాది. నన్ను తీసుకుపోండి!

పోలీ : చోరీచేసింది వీడు!

కమ : చేయించింది నేను. అంచేత యిద్దరినీ తీసుకుపోండి ! ఆ మాత్రంజాలిలేదా మీకు?

పోలీ : జాలి! అహ్హాహ్హా! మాకు జాలివుండదు. నీ తమ్ముడు చేసినపని చట్టానికి వ్యతిరేకం! ఆ చట్టాన్ని మేం అమలు జరిపేవాళ్ళం!

కమ : అయితే జీవంలేని కాగితంముక్కకు దాసులై, జీవమున్న మానవుణ్ని హింసిస్తారా?

పోలీ : చాలించు! నీ అధికప్రసంగం! తప్పుకో! వూం తప్పుకో

(కమలను త్రోసేసి, రాముడ్ని తీసుకుపోతాడు. కమల పడిపోతుంది.)

రాము : అక్కా ?

కమ : తమ్ముడూ! (లేచి వెళ్ళబోతుంది)

[జగన్నాధరావు విలాసంగా ప్రవేశం]

జగ : హాహ్హాహ్హా! ఆగు! అందనిఫలాని కెందుకుపరుగెత్తుతావ్? ఇదిగో! అందేవస్తువు! (అని కౌగలించుకోబోతాడు)

కమ : (వెటకడుగేసి) తప్పుకోండి? నా త్రోవకడ్డురాకండి! నా తమ్ముడ్ని రక్షించుకోనివ్వండి!

జగ : అది నా చేతిలోవుంది. నీవు "ఊ" అంటె, నీ తమ్ముడ్నే కాదు నా సమస్తాన్నీ నీ కాళ్ళముందు పెడతా!

కమ : మీరా, దీనికికారణం? మీదింత రాతిగుండా? మీకు మేం, ఏం అపకారంచేశాం? అడుక్కుతిని బ్రతుకు తున్నాం?

జగ : కమలా! నిన్నెవ రడుక్కుతినమన్నారు? హాయిగాయింద్ర వైభవ మనుభవించమంటె, (కాస్తతీవ్రంగా) బాగా ఆలోచించుకో! ఎందుకిన్ని బాధలుపడతావ్? నీచమైన నీ బ్రతుకకంటె ఉచ్ఛమైన ఆనందాన్ననుభవించు!... రా...ఇక తటపటాయించకు!

కమ : ఉచ్ఛమైన ఆనందంకోసం, తుచ్ఛమైన పనిచేయమం టారా? — ఏ ఆడదన్నా కష్టాలు తప్పించుకోడానికి, శీలానమ్మ సాహసిస్తుందా?

జగ : ఎవడ్ని నాన్నా పెండ్లాడితే వాడికి శీలాన్నమ్ముకోవ్వూ?

కమ : అగ్నిసాక్షిగా పెండ్లాడినభర్తకు ఆడది శీలాన్నే కాదు. మనస్సునూ—అన్నింటినీ అర్పిస్తుంది—అమ్ముకోదు.

జగ : అలా మెడకు వురిత్రాడుబిగించే సూత్రానికి బానిసై పోయే పెండ్లికంటె, మనసారా నిన్ను ప్రేమిస్తూ, తపించి పోయే నా మనస్సును అంగీకరించవా?

కమ : మనస్సు! మీది మనస్సుకాదు—బండరాయి. నాతండ్రికి ఎంతఅన్యాయంచేసారో? మా కుటుంబాన్ని ఎన్నిఅవ మానాలపాలుజేసారో?— ఒక్కసారి ఆలోచించండి! మీది మనస్సో, కాదో తెలుస్తుంది. అటువంటి మీ మనస్సును కౌగలించుకునే ఆడది కండ్లుమూసు కొని గంగను కౌగలించుకుంటె మంచిది!

జగ : ఇక నీతో నయాన్ని చెబితే లాభంలేదు...జాగ్రత్తగా ఆలోచించు! నీ తమ్ముడిగతేమవుతుందో? ఖైదులోపెట్టి కళ్ళుపోట్లు పొడిపించి వొదిలిపెడతా. నీ ముఖం తానెన్నడూ చూడలేకుండాచేస్తా. నీ మార్గంలో నేనడు గడుగునా తారసిల్లే త్రాచునని మరచిపోకు!

కమ : మీరు త్రాచైె నన్ను కాటేయండి! ఆనందిస్తా! (కాస్త దూరంగా జగన్నాధరావు కాళ్ళపైబడి) నా తమ్ముడ్ని మాత్రం మీరు బాధించకండి!

జగ : బాధించను! చెప్పు! నా కోర్కెగురించేమంటావో?

కమ: నా తమ్ముడ్ని ముందువొదిలిపెట్టించండి!

జగ: కమల భుజాలు పట్టుకొని, లేవనెత్తుతూ) సెభాష్! కమలా! ఇకనీమనోహంస, నా హృదయాకాశంలో స్వేచ్ఛగా విహరిస్తుంది. కమలా! అదృష్టమంటె నీదే! ఆహాహా! కమలా? (అని కౌగలించుకోబోతాడు. కమల దూరంగాతప్పుకుంటుంది.)

[పోతురాజు, సంతోషంతో, వొగురుస్తూ ప్రవేశిస్తాడు.]

పోతు: (జగన్నాధరావుతో) మీ కోసం వూరంతా గాలించేస్తున్నా! ఇదిగో! కాగితం! మిమల్నే ఎన్నికలఅభ్యర్థిగా అంగీకరించేరు.

జగ: సెబాష్! గురువుగారూ! నిజంగా పట్టుదలంటె మీదే!

పోతు: హే! పాతికేండ్ల సర్వీసు మనది. మనం తల్చుకుంటె నల్లరాయి బ్రద్దలు కావాల్సిందే!

జగ: ఆహాహా! యీ రోజెంత సుదినం! అన్నీ అనుకూలంగానే జరిగిపోతున్నా యే! ఇక యీ జగన్నాధరావు జగన్నాధ రధానికీ తిరిగేలేదు.

పోతు: మీరు వెంటనేరావాలి. మీతో చాలాపనులున్నాయ్!

జగ: పదండి! నా ఆలస్యమేమీ లేదు. ఇదిగో—నీ తమ్ముడ్ని పోలీసులు తీసుకువెళ్ళారంటె పరామర్శకొచ్చానంతే పదండి! (కమలతో) కమలా! విచారించకు. నీతమ్ముడు చిటికెలో వస్తాడు! (నడుస్తూ) పదండి గురువుగారూ! (ఇద్దరూ వెడుతుంటె జగన్నాధరావు ఒకడు ఆగి) హూ! వరదలాతయారు సమయానికి! (అని వెళ్ళిపోతాడు!)

కమ : (వెడుతున్న జగన్నాథరావును చూస్తూ) యీ బండ రాయి, నా బ్రతుకు కింకెన్ని బాధలు పెడుతుందో? (దుఃఖంతో) మానవతి బ్రతుకలేని యీ లోకం, ఎప్పుడు మటుమాయమైపోతుందో? ఓ పెద్దవుప్పె నొచ్చి యీ లోకాన్ని తుడిచేస్తే—కష్టాలన్నీ అంతమై పోను...ఓంయ్! భగవంతుడా? ఏ పాపమెరుగని పేద వాళ్ళకాకష్టాలు? ఎన్నో పీకలుకోస్తున్న ధనవంతుల్ని శిక్షించవా? (క్రుంగిపోతూ—పాట.)

కనరారా! యీ కష్టాలూ!
ఎంతకాలమూ - సాగిపోవునో ॥క॥
ధనపాశముల దాసులచేసి
అడుకొట్టితిన్నా నేరముకట్టి,
పవిత్రభారత వనితలబట్టి
ప్రాణ మానముల వేధించేటి ॥క॥

[పాటఐపోగానే రాముడు పరుగెత్తుకొని ప్రవేశిస్తాడు]

రాము : అక్కా! (అని కౌగలించుకుంటాడు)

కమ : తమ్ముడూ! (అని హృదయాని కత్తుకుంటుంది)

రాము : (విచారంతో) అక్కా! ఆ జగన్నాథరావును నాకోస మెందుకర్ధించావక్కా! జాలరి, గేలానికి ఎర్రతగిలించ డం, చేపకడుపునింపడానికా? అక్కా! వాడికి మన కెంతఅపకారం చేయదలచాడో ఆలోచించావా?

కమ : తమ్ముడూ! నిన్ను జైల్లో పెట్టి హింసిస్తుంటే, నా గుండె చలించకుండా వుంటుందా ? నేను బ్రతుకగలనా ?

రాము : కష్టమొచ్చిందని గాడిద కాళ్ళు పట్టుకుంటామా ? యీ అన్యాయాలు ఎంతకాలం సాగుతాయనుకున్నావ్? నిజం, చెప్పక్కా! ఫ్యాక్టరీకే వాడు నన్ను వొదిలిపెట్టించాడా? నీ మెడలిరిచేవుంటాడు! (కమలను కదిలిస్తూ) చెప్పక్కా?

కమ : (ఏడుస్తూ) నిన్ను చావగొట్టిస్తానన్నాడు. (అతని తలపై తల పెడ్తుంది)

రాము : (ఆతల నెత్తుతూ) అంచేత నీవు శీలాన్నమ్ముకుంటావా?

కమ : లేదు తమ్ముడూ! నా బ్రతికున్న జీవి ఎన్నడూ అందు కంగీకరించలేదు — అంగీకరించదు ... నా తమ్ముడ్ని 'వొదిలిపెట్టించండి' అన్నానంతే.

రాము : ఆ మాటే కొంపతీస్తుందక్కా! ఏడవకక్కా! నేను బ్రతికుండగా నీకు భయంలేదు. (కోపంతో) నీచుడు భయపెట్టి, నిన్ను మోసంచేస్తాడా ? వాడిసంగతి కనుక్కుంటా, ఆ చేనేతసంఘంవాళ్ళకు చెబితే వీడిపని పడతారు... అక్కా! నీ వింక భిక్షానికిరాకు!...యీ పాడు ప్రపంచానికి కాస్త దూరంగావుందక్కా ! ...పద... పదక్కా ! (వెళ్ళిపోతారు)

— తెర —

# 7

[చిన్న ఘటీరం. కమల— పాట పాడుతూ—చినిగిన చొక్కా— మాసిక లేస్తూ వుంటుంది.]

పా ట.

ఒడుదుడుకుల జీవితమే బాధా
సమలోకపు జీవితమే హాయీ!
అసినిశిలో అలసేకాంతీ ;
మోడులో తారాడే జవనం
ఒడుదుడుకుల, గుండెలో బల్లెం
సమలోకానికే సోపానం ! ॥ఒ॥

[పాట పూర్తికాగానే. రాముడు—చిల్లరసామానుల బుట్ట, నాలుగు నూలుపిడులూ పట్టుకొని ఆత్రుతగా "అక్కా! అక్కా!!" అని ప్రవేశించి, ఏదోతగిలి పడిపోతాడు.]

కమ : అబ్బ! ఎప్పుడూ కంగారే! ... ఏం పుట్టిమునిగిపోయిం దని? (చెల్లాచెదరైన సామానుల్ని ఏరుతుంటుంది)

రాము : (లేచి, సంతోషంతో) మునిగిపోయింది. యీదెబ్బతో మోసగాళ్ళందరిపుట్టి మునిగిపోతోంది ... ఇదిగో, నూలు! ఇంకిక్కడనుండి మనం మగ్గంపెట్టుకొని హాయిగా జీవించొచ్చు !

కమ : నీతో నవ్వొచ్చినా, ఏడుపొచ్చినా, కష్టమేరా ? ఇంతకీ ఇవన్నీ ఎక్కడివిరా ?

రాము : ఎలక్షన్లు కాదా, అక్కా! డబ్బున్నోళ్లు దానధర్మాలు చేయడం నేర్చుకున్నారు, యీనాలుగు రోజులూను. అలాచేస్తేనేగాని వారి వుదారత్వం లోకానికి వెల్లడై ఎలక్షన్లో నెగ్గరుగా మరి? ఇక యీనూలు పిడులం టావా? నేతసంఘంవాళ్ళు మళ్ళీ జగనాథరావు బ్లాకులో అమ్మే నూలంతా పట్టేసి నేతగాళ్ళందరికీ పంచేసారు. అందులో మనకో, నాలుగుపిళ్ళొచ్చాయి. (కమల నిట్టూరుస్తుంది) నాన్న తాకట్టుపెట్టిన మగ్గం వెంటనే విడిపించేసుకుని నేత మొదలెడదాం... యీ ఎలక్షన్లలో మన బికుగాళ్ళ రాజ్యమొచ్చిందా ?—ఇక చూచుకో! మనకష్టాలంతమై పోయినట్టే! జై! కూలి సంఘాలకూ...

[నేపథ్యంలో "జై!" చేనేతసంఘాలకు జై! "అన్న కేకలు. రాముడుకూడా "జై!" అంటాడు. మళ్ళీ కేకలు. రాముడు కూడా "జై!" అంటాడు. మళ్ళీ "కూలోడికే ఓటు వేయాలి" అని. రాముడు "వేయాలి" అని గర్జిస్తాడు.]

సత్యం చూడక్కా! (కమలను ప్రక్కకు తీసుకెళ్ళి చూపెడుతూ) అదిగో!... మొదటావరుస!...ఇంకా జనం! అబ్బ!...,ఇప్పుడు తరంగాలుగా వచ్చేస్తున్నా రక్కా!...అక్కా! ఏకొండ కోనలోనో నీటిబుగ్గ

పుడుతుంది. సెలయేరై స్రవిస్తుంది. నదీసంగమం చేసి, సాగరంలో కలిసిపోయి, మహాసముద్రమై మహోన్నత కెరటాలై విజృంభించి—సాగిపోతుంది. మధ్య మధ్య మత్తెక్కి నిలబడ్డ ఇసుకపర్రలను తుడిచేయడానికి!...చూడక్కా! నిజంగా ఆజనం అలా లేరూ? అబ్బ ఎంతమందున్నారో?......ఎక్కడ చూచినా కూలోళ్ళే! వాళ్ళంతా ఏకమై ఎదురుతిరిగారు! ఇక ఏదాగుతుం దక్కా?

కమ : (మాట్లాడదు.)

రాము : అదేం టక్కా! మాట్లాడవేం?

కమ : వాగు! అలా నీయిష్టమొచ్చినట్లల్లా వాగు!

రాము : ఇది వాగుడుకాదక్కా! నిజం!

కమ : ఏం, నిజమో? మళ్ళీ పీకలమీాదికి తెచ్చావ్! (అని విచారిస్తుంది.)

రాము : ఏం? తెచ్చాను?

కమ : ఈదొంగనూ లెందుకు తెచ్చావ్?

రాము : ఇది దొంగనూలా?

కమ : మరెక్కడిది?

రాము : చెప్పాగా! నేతసంఘం వాళ్ళు పంచిన బాపతని!

కమ : వెనుక ఒకసారి పట్టుకున్నవాళ్ళను కొట్లో పెట్టారూ! ఇప్పుడీ నూలు తెచ్చిన మనల్నికూడా పెడతారు!

రాము : అదంత పైపైనుందా? ఏం? వాళ్ళ బాబుగారి

సామ్మా, నేతగాళ్ళ నూలు బ్లాకులో అమ్ముకోడానికి ? అందుకే ఆ నూలు పట్టుకొని పంచేసారు.

కమ : ఒకరి కొంప కొల్లగొట్టి పంచుకుంటె ఎవరైనా పూరు కుంటార్రా ?

రాము : అదేంటక్కా ! వాడి దగ్గర పట్టుకున్న నూలంతటికీ నేతసంఘం వాళ్ళు కంట్రోలు రేటుప్రకారం డబ్బు ఇచ్చే సారుగా ? ఇక కొల్లగొట్టి ఎత్తుకురావడ మేముంది ?

కమ : (గద్గదకంఠంతో) వొద్దురా ! మనకీ నూలొద్దు !... నా కుడికన్ను అదురుతోంది. తీసుకెళ్ళి ఇచ్చేయరా !

రాము : ఫరవా లేదక్కా !

కమ : (కోపంతో, నూలు పిడులు తీసి, రాముడు ముందు పారేస్తూ) ఇవి కొంపలో వుండగూడదు. బయట పారేయ్ !

[నేపథ్యంలో "జగన్నాథరావుగారికే మీా ఓటు - వేయండి!" "పసుపుపెట్టెలోనే మీా ఓటు – వేయండి!" అన్న కేకలు, జగన్నాథరావూ, పోతురాజూ, పచ్చపెట్టెలతో ప్రవేశిస్తారు)

రాము : (కోపంతో వారిని సమీాపించి) ఓట్లు ! ఓట్లు కావాలేం ? ఎన్నిరంకులున్నా, సిగ్గులేకుండా, ఓట్లకుమాత్రం తయారూ ! ప్రజలకు తిండిపెట్టలేని ఏప్రభుత్వానికైనా, ఏ పక్షానికైనా, పరిపాలించడానికి హక్కుంది ?

జగ : ఓరివెధవా ! మాకే ఎదురాడుతున్నావ్?

రాము : ఎవరూరాకపోడానికి, మీా పులుసూ, ముద్దా, తినడం లేను !

పోతు : హే ! పాతికేండ్ల సర్వీసు మనది ... (అని మీాసాలు దువ్వుతాడు)

రాము : హా హ్హా హ్హా హ్హా ! రొయ్యికీ వున్నాయి. బారెడేసి మీాసాలు !

జగ : తెంపకాయులు కావాలా ?

రాము : అందుకే ఇప్పుడు బయులుదేరేం, ఓట్లకని !

జగ : నీ ఇంటి కెవడొచ్చాడురా !

రాము : పోసీ, (ఇల్లు చూపుతూ) యీా నేతగాళ్లిళ్లకొచ్చారా?

పోతు : అవునురా. వాళ్ళ యిళ్ళకే వచ్చాం. ఎంత కాదన్నా, వాళ్లంతా మన చేనేత పారిశ్రామికులు. జగన్నాధరావు గారు మాత్రం పైవారా ?

రాము : మనవాళ్ళనేకోసమే, నూలు పోగుతో గొంతులు కోసారు ?

జగ : ఏడిశావ్, వెధవ ! (పోతురాజుతో) రండి ! పోదాం !!

పోతు : వుండండి ! (రాముడుతో) పోసీ, మన కాంగ్రెసును చూచైనా వేయొచ్చుగా, మన ఓట్లు ?

రాము : కాంగ్రెసును చూచా ? ఎందుకు ? ఇదివరకు వూళ్లో, అరడజను సారా కొట్లుంటె, యిప్పు డారువందలు చేసినందుకా ? మాకో నూలుపోగైనా దొరకనివ్వకుండా,

బ్లాకుమార్కెట్టును చిరస్థాయి చేసినందుకా ? లేచినా, కూర్చున్నా, లంచాన్నిమప్పినందుకా?-ఇక మీ ఆటలు సాగవ్ ! వెనుకటి రోజులు – గాడిదను నిలబెట్టి కాంగ్రెస్సంటె ఓటేయడానికి !

జగ : జగత్కాంత్రీ, వీడి కెవడు చెబుతాడండీ ?

పోతు : మీరుండండి ! అయిదునిమిషాల్లో వీడితల త్రిప్పేస్తా! హు ! మనం తల్చుకుంటె సల్లరాయి బ్రద్దలు కావాల్సిందే! (రాముడుతో) కాంగ్రెసులో ఎన్నితప్పులున్నా మనమంతా ఒప్పుకోవలసింది మాత్రం ఒకటుంది. అదేమిటంటావా? గాంధిగారి సిద్ధాంతాలను అక్షరాలా అమలు జరిపింది కాబట్టి...

రాము : ఓఁ ! (వ్యంగ్యంగా) కాదుమరి ! ఆయన వారాని కోసారే వుపవాసముంటె మనివారు ఒకసారే ఏం ఖర్మ మని మూడు రోజులు చేయిస్తున్నారు......ఇక బట్ట అంటారా ? ఆయన గజమున్నర అంగవస్త్రం మనిషికి చాలంటె, అదేం బాగో లేదని గోచీ వరకూ లాక్కొచ్చారు...ఏం ? ఇందుకేనా అండీ ? మన ఓట్లు కాంగ్రెసు కేయడం ?

జగ : నోరుముయ్ !

రాము : మూసుకున్నట్టేనండి !

[నేపథ్యంలో "జగన్నాథరావుగారికే మీ ఓటు"]

రాము : (జనాన్ని పిలుస్తున్నట్టుగా) రండిరా ! చూస్తారేం ? వూ ! జగన్నాధరావుగారికే మన ఓటు, వెయ్యండి ! వెయ్యండిరా ! చెప్పులూ, చీపురుకట్టలూనూ. (వరుసగా, రెండు చెప్పులు జగన్నాధరావు ముందు పడతాయి) నోల్లుకోండి ! యీా ఎన్నికల్లో మీాకొచ్చేవన్నీ యివే !

జగ : లండీకే! నీసంగతి కనుక్కుంటా ! (చిందులు త్రొక్కుతూ) రండి ! గురువుగారూ ! (అని బయలుదేరుతాడు. మార్గంలో నూలు పిడులు కనబడతాయి. అవి తీసి — రాముడుతో) ఆరి వెధవ ! పక్కా బందిపోటువురా నీవు ! హు! మిమ్మల్ని కరుణించడం, పాముకు పాలేసి పెంచడమే ! వుండు నీ సంగతి కనుక్కుంటా ! (దురుసుగా కదం త్రొక్కుతూ పోతాడు పోతురాజుకూడా)

కమ : ఎందుకొచ్చిన గొడవరా యిదంతా ?

రాము : వాడేంచేస్తాడక్కా ! మనకేం ఫర్వాలేదు.

పోలీ : (హంటరుతో చెళ్లున కొడుతూ) మరేం పర్వాలేదేం ?

రాము : హమ్మా ! (అని గిర్రున తిరుగుతూ కమల కాళ్లపై బడతాడు)

కమ : తమ్ముడూ ! (అని వీపుమీాద చొక్కా వణుకుతున్న చేతులల్లో నెమ్మదిగా ఎత్తుతూ, ఓ పెద్ద తట్టు తేలడం చూచి) హా! హా!...అయ్యో ! ఇదేనా ధర్మం ?

పోలీ : ధర్మం ! లే ! తప్పుకో !—(జబ్బ పట్టుకొని కమల మొర పెట్టుకుంటున్నా, రాముడ్ని యీడ్చుకుపోతాడు)

కమ : (నేలపై పడిపోయిన కొంతసేపటికి ఏడుస్తూ లేచి) ఇంకెన్నాళ్ళు రాసిపెట్టాడో, భగవంతు డీ బాధలు ! (అని రెండు చేతుల్లో ముఖం పెట్టుకొని వెక్కి, వెక్కి ఏడుస్తుంది)

జగ : ("చక్!" మని ప్రవేశించి) వంచించి నాటకాలాడాలను కున్నారా ? యీ నాటకా లెంతకాలమో చూస్తాను... (అని వెళ్ళిపోబోతాడు)

కమ : జగన్నాధరావుగారూ ? (అని ఏడుస్తూ కాళ్ళపై పడు తుంది)

జగ : (తన్నేస్తూ) ఛీ ! (అని విడిపించుకొని వెళ్ళిపోబోతాడు)

కమ : ("చక్"మని లేచి, కోపంగా అశ్రురుద్ధకంఠంతో) యీ మీ దుండగాలు సాగిపోవాల్సిందేనా ?

జగ : ఎవరివే దుండగాలు ? నంగనాచీ ! తమ్ముడుచేత దొంగ తనాలు చేయించి, వాడికీ, పీడికీ ఏడిచి అవి కప్పుకుం టున్నావ్ !

కమ : జాగ్రత్తగా మాట్లాడండి !

జగ : హు ! జాగ్రత్త ! యీవేళ నీనాటకంలో చరమాంకం చూస్తావ్ ! (అని మీదికి వెళ్ళబోతాడు.)

కమ : దూరంగా వుండు !

జగ : ఇంక దూరమెందుకు ? నీతమ్ముడు దొంగతనం చేసి

నప్పుడు. ఏమని విడిపించమన్నావో జ్ఞాపకముందా?

కమ: ఏమన్నాను?

జగ: ఏమన్నావా? నావాంఛ తీరుస్తా ననలేదూ? (బలాత్కరిస్తూ) రా! ఇక యీపంజరంలోంచి బయటకు పోలేవ్! రా!

కమ: (గింజుకుంటూ) దుర్మార్గుడా వొదులు! నీకు చెల్లెళ్ళు లేరూ? నీది హృదయంకాదూ?......వొదులు! వొదులు! (ఒక్క చేయి విడిపించుకొని, ప్రక్కనున్న మట్టికుండతో, తలపై కొడుతుంది.)

జగ: (బాధతో) అబ్బా! (కామంతో) ఏమైనాసరే! నిన్ను వొదలను! వొదలను! (అని మరీ బలవంతం చేస్తాడు.)

కమ: వొదులు! వొదులు! (అని గింజుకుంటూ చేయి కరుస్తుంది.)

జగ: అమ్మ! ఆ! వొదులు! వొదులు! ఊ! (అని పీక పిసుకుతాడు.)

[కమల గుడ్లు తేలేస్తుంది. కరుస్తున్నచేయి తొలిపోతుంది. జగన్నాధరావుకు ముచ్చెమటలు క్రమ్ముతాయి. వొణికిపోతాడు. కమల అపాదమస్తకం తడుముతాడు. కమల చనిపోయిందని గుర్తించాక కంగారుగా]

హా! హత్య!...పోలీసు! (నెమ్మదిగా) కమల హత్య! పోలీస్! పోలీస్! (అంటూ వెళ్ళిపోతాడు.)

['జగన్నాధరావుగారూ! జగన్నాధరావుగారూ!' అంటూ పోతురాజు ప్రవేశం.]

పోతు : (తొందరగా వచ్చి) జగన్నాథరావుగారూ! (శవం కాళ్ళకు తగిలి) అరె! ఏమిటిది? (శవాన్ని తడిమి) శవం! ...శవమే? (శవం నోటినుండి కారుతున్న రక్తాన్ని తడిమి) కమలశవం! (వొణుకుతూ, రక్తాన్ని చూస్తూ లేచి) రక్తం! అబ్బ! యీ ఘోరహత్యకు కారకుడే ముష్కరుడో? అయ్యో! ఆ ముష్కరుడు యీ లేత ప్రాణిని గుప్పెట్లోపెట్టి నలుపుతున్నప్పుడు, నరాలుపట్లుతప్పి, జీవతంత్రులు స్తంభించి, నోట రక్తంకక్కుతూ ఎంత గింజుకుందో? అబ్బ: (ఎదుటికొచ్చి) నీచాతినీచాముా, కరకుకర్కశత్వమనికూడా ఎంచక, నిండుహృదయాన్ని ఖూనీచేసిన హంతకు డెవడో ? (ఓ క్షణమాలోచించి) ఎవడై తేనేం? ఎన్నికలు తిరుణాళ్ళలా జరిగిపోతుంటె, దీనిగురించి మధ్య నా కెందుకు ? అందులోనూ, మంచి కెడితే చెడు ఎదురౌతుంది! (అని వెళ్ళపోబోతాడు)

[జగన్నాథరావు—ప్రవేశం—కూడాపోలీసుంటాడు]

జగ : ఆగు! (పోలీసుతో) పోలీస్! యీ దొంగ దేశభక్తుడ్ని బంధించు! వీడే హంతకుడు!

పోలీ : (బంధించడానికి ముందుకొస్తాడు)

పోతు : ఆగండి! (జగన్నాథరావుతో) నేనా? జగన్నాథరావు గారూ? ఏమిటీ దారుణం? నన్ను గురించే మాట్లాడు తున్నారా?

జగ : ఆఁ! గురించే...కమలను నీవే ఖూనీచేస్తావనడానికి (వెంట్రుకలు పట్టుకొని) ఇన్ని ఆధారాలున్నవి!...(కాని స్టేబుల్ తో) కానిస్టేబుల్ గారూ! ఇదిగో! అతనే ఖూనీ

చేసాడనడానికి యీ ఒక్క ఆధారం చాలు! (అని ఒక ఉత్తరమిస్తాడు) మరిసెలవ్! తతిమాపని మీరు కాని వ్వండి. (అని పోతురాజువంక వికవికపుచూపుచూస్తూ వెళ్ళిపోతాడు)

పోతు : ఆగు!...(ఆగడు)...విశ్వాసఘాతకుడా?...

పోలీ : ముందుస్టేషనుకు పదండి. మిమ్మల్ని అరస్టుచేస్తున్నా!

పోతు : ఎందుకు?

పోలీ : (ఉత్తరమిస్తూ) యిదిగో ఆధారం!

పోతు : ఏమిటావుత్తరం? (ఉత్తరంచూస్తూ కంగారుగా) హా! ...కమలపెండ్లి తారుమారుచేయించినప్పుడు, నేను వ్రాసిన ఉత్తరమా?...(పోలీసుతో) మీకు కండ్లులేవ్ మీకో న్యాయముంటే, శక్తుంటే, అదిగో! హంతకుడు ఆ జగన్నాధరావును పట్టుకోండి.

పోలీ : నీ పాతికేండ్ల సర్వీసుకబుర్లు యికకట్టిపెట్టు. కమల పీక పిసికి చంపినట్లు, రక్తసిక్తమైన నీ హస్తాలు చెప్పడం లేదూ?...మూర్ఖుడా!...పద! పద!

పోతు : (పండ్లుకొరుకుతూ) ఆగండి! జగన్నాధరావు! జగన్నా ధరావు! ఓరి విశ్వాసఘాతకుడా! ఇలాఎన్నిహత్యలుచేసి నీ పాపం కప్పుకుంటావో! చూస్తా! యీపరిభ్రమిస్తోన్న పృథ్వీచక్రపుపళ్ళల్లోపడి నీ పుర్రె పగిలిపోవడం తథ్యం. దారుణం...దారుణం...(కమలపై "భేర్" మంటూ పడి)

పోతు : కమలా ?...నీకెంత అన్యాయం చేసాను కమలా?... ఆ జగన్నాధరావు జంత్రీపెట్టెలో నేనో అట్టబొమ్మనై నీతండ్రి చావుకు కారణమయ్యా !...నిజం కమలా ? నీ పెండ్లి వేలాలు చేయడమేకాదు. ఆ జగన్నాధరావు పగపట్టి పామై నిన్ను తరుముతుంటే, నోరెత్తలేక, నీహత్యకుకూడా కారణమైన క్రూరుణ్ణి కమలా! ఆకిరాతుడి కామ, ధన, మదోన్మత్త,ఛత్రచ్ఛాయలు నాకండ్లు కప్పేశాయి...కమలా! (ఒకటే ఏడుపు)...నన్ను క్షమించమ్మా! క్షమించవ్!...అవును! నీవు క్షమించవ్! ఎలా క్షమిస్తావమ్మా! యీగ్రుడ్డి లోకం నీజీవమున్నంతకాలం నీ మొరాలకించలేదు...యిక గత్యంతరంలేక, స్మశానానికి నీమొర వినిపిద్దామని వెళ్ళుతున్నావన్నసంగతి నాకు తెలుసునమ్మా! చూడు! చూడమ్మా! ఒక్కసారి! నాకండ్లిప్పుడు తెరవబడ్డాయి. నీవు నారాతిగుండెలో విప్లవం తెచ్చావ్. నాలోనేకాదు తల్లీ! నాలా ధనికులకు అడుగులకు మడుగులొత్తే కుహనా దేశభక్తుల గుండెలు దహించాశావ్ తల్లీ !...చచ్చి సాధించావమ్మా విప్లవం! (కమలను కదుపుతూ) కమలా!...(పైకి చూచి) ఆహా! కన్నారా! యీదార్ష్ట్యాలు. భారతప్రజాకోటి మానసంరక్షకులైన యీవస్త్రప్రదాతల అభాగ్యజీవితాలు ? కూడులేక కుమిలిపోయి చింకిరి గుడ్డలు సింగారించుకొని, బక్కచిక్కిన దుర్భరజీవితంతో, శవాలై పోతున్న నేతబిడ్డలగతి ?.........యింకెంతకాలం సాగిపోవాలీ

డాష్ట్యాలు ?... చెప్పండి ?...

పోతు : పలకరేం?...

(నేపథ్యంలో "ధనికుల దాష్ట్యాలు నశించాలి" "చేనేత సంఘాలకు జై" 'కూలోడికే మీ వోటు వేయండి' అన్న కేకలు)

పోతు : (అటుచూచి ... వణుకుతున్న చేతులు పైకెత్తి చూపుతూ) వేస్తాను! నే వేయడమే కాదు అందరిచేతా వేయిస్తాను. అవును. గాంధీజీ చెప్పారు. "స్కావెంజర్ సింహాసనమెక్కాలని" అంతే. కూలోడికే మావోటు. ...ఆహా!...హృదయమంటే కార్మికులదే! ఇక నేను మీలోవాడినే! మీ నిరుపేదలకొంపల్లో నే మీతోనే, చెట్టా పట్టాల్ పట్టి తిరుగుతా!...(కమలపై బడి) కమలా ...పదమ్మా! పద! యీ పేదలకన్నిటితోనే నీ ఆత్మ శాంతిస్తుందమ్మా! (కమలనెత్తి) పదమ్మా! పద!

పోలీ : అటుకాదు యిటు. హు! ప్రసూతివైరాగ్యం! ఎందుకీ వేషాలు! నెత్తిన కాంగ్రెస్ టోపీ! వంటికి ఖద్దరుదుస్తులు! ...సిగ్గులేదూ! యిది గాంధీగారి ఆత్మకుద్రోహంకూడాను. పట్టినంతవరకూ ఆ జగన్నాథరావు పాన్పుకు హారతిపట్టావ్! యీ వేళ యీ ఖూనీ మీదపడేసరికి, వక్కసారిగా ప్లేటుమార్చి, ఆ మాలకొంపల్లో తలదాచుకో సిద్ధమౌతున్నావ్! పద! నీ సంగతి కనుక్కుంటా. ప్రతీవాడికి ఫేషనైపోయింది. క్షణానికో రంగుమార్చి దేశభక్తులైపోయి, ప్రజలను మోసంచేయడం!

పోతు : క్షమించండి. జవానుగారూ! మీరన్నదంతా నిజమే!

పోలీ : నిజమేలే! ముందుపద.

పోతు : వస్తున్నా. (నాలుగడుగు లేసి, గద్గదకంఠంతో) యీ గుండెబరువు దింపుకోనివ్వండి. బాపూజీ! ఓ అమర మూర్తీ! నీ ఆత్మ కెంతద్రోహంచేసాను? క్షమించుతండ్రీ ...లాల్ ఖిల్లా ప్రాంగణంలో ఒకహంతకునిచేతిలో నీవు బలైనప్పుడు ఘోషించావ్! "నాలాకోట్లాది భారతీయులు బలికాకుండా కాపాడమని!" ఆనాడు నీ కరుణాసాగరహృదయంనుండి స్రవించినరక్తధార! భారత ప్రజాకోటికో దివ్యజ్యోతిలా మెరిసింది... కాని కటిక చీకటిలో కూపస్థమండూకంలా కండ్లు పొరలుక్రమ్మిపోయిన నా కళ్ళు నీవు ప్రసాదించినవెలుగు చూడలేకపోయాయి. పవిత్రమైన ఖద్దరు ముసుగులోనాచుట్టూ ఆకలిమంటలతో ఆక్రందిస్తూ మరణిస్తున్న అనేకఅభాగ్య జీవితాలనుచూస్తూ కొంగజపంచేసే దేశభక్తుడనయ్యా! బాపూ! యీ దురంతాలుచూచి నీ ఆత్మ ఎంతపరితపిస్తుందో! ఆఁ! ఏమిటీ కన్నీరు? ... బాపూ! అది యేడుపా? క్షమించుతండ్రీ! క్షమించు. కమలా? (అని యేడుస్తాడు)

పోలీ : యీ మొసలికన్నీరు ఆపుచేసి, యిక పదవయ్యా.

పోతు : పదండి. నాలో వో దివ్యజ్యోతి ప్రవేసించింది ... ఆ జ్యోతి నన్ను సత్యంకోసం నిలబడమని ప్రబోధిస్తోంది ...పదండి. 'యేపుల్లను నిప్పంటే ఆ పుల్లే కాలిపోతుంది!' (ఎదుటికి దీనంగాచూచి బయలుదేరతాడు)

పోలీ : కపటవేషధారి. (అని ఎర్రగా ఎదుటికిచూచి వెంటనే నడుస్తాడు)

రాము : (పరిగెత్తుకుంటూ ఏడుస్తూ) అక్కా... అక్కా!...
(అని పోతురాజు సందిటనున్న శవంపై పడిపోతాడు)

పోతు : (విచారంతో) రాముడూ!... మీ కష్టాలకు కారణాన్ని నేనురా!...

రాము : (నెమ్మదిగా తలెత్తి) కారకుడివి... నా నాన్నను, నా అక్కను మింగేసిన రాక్షసులుమీరు!... అక్కా!... ఇక నా గత్యేమిటి. (భోరున యేడుస్తాడు) పదండి!—నేత సంఘంవాళ్ళు ఆ ఖూనీఖోరు జగన్నాధరావును పట్టు కొస్తున్నారు. (పోతురాజు నుద్దేశించి) మీసంగతీ తేలు తుంది పదండి!—

పోలీ : అయితేపదండి పోలీసుస్టేషన్కు.

రాము : (పోతురాజుచేతిలోంచిఅక్కనుపట్టుకుంటూనే ఏడుస్తూ) పదండి!—అక్కా!— నేనులేకుండా నీ కెంతపనిజరిగి పోయింది. (విచారసాగరతరంగమై) పోనీలే! నీచావుతో యీ లోకంకడుపు చల్లబడిపోతుంది— అక్కా!— (అని తల శవానికి బాదుకుంటాడు. అంతా వెళ్ళిపో తుంటారు.)

నేపధ్యంలో.

ధనాంధులే - ప్రభువులై
చెలగునందాక - ధరణిపై
ఆగదోయ్ ! - నీ కన్నీటిధార !

("బేర్" మని ఏడుస్తూ - తెర జారుతుంది.)





# నేతబిడ్డ



"ఈ నాటకం చేనేతసమస్యా పరిష్కారానికి చక్కని మార్గం చూపింది. "5 లక్షల మగ్గాల్ని కంట్రోలు చేయగలిగిన ప్రభుత్వం 50 మిల్లుల్నెలా చేయలేదే?" అని శక్తివంతమైన గొంతుతో కవి గర్జించాడు."

ఆంధ్రప్రభ.
6—7—51.

"ఈ నాటకం చేనేతకార్మికుల ఆకలి బాధను విశదపరుస్తుంది.... పెద్ద పెద్ద వ్యాపారస్తులు బీద చేనేత కార్మికుల ప్రాణాల నే విధంగా హస్తగతం చేసుకున్నారో?.... నూలును బ్లాకులో అమ్మి డబ్బుచేసుకొని, ఆధునికబలంతో ఆ బీదల ఓల్లనుకూడా ఎలా గుప్పిట్లో పెట్టుకుంటారో? నాటకరచయిత ఇందులో నిరూపించాడు.... వుత్తమ ఆశయాలతో వివిధరంగాలనూ కూర్చినందుకు రచయితకు మా ధన్యవాదాలు."

ప్రజాశంఖు.
4—7—51.

"నేతబిడ్డ" నాటకం ఇంకా అనేకమంది ప్రముఖుల మన్ననల నందింది.



## మా రాబోవు నవలలు

పితూరీ : సీతారామరాజా – చనిపోయాడం టారు కొందరు. లేదు–బ్రతికేవున్నాడంటారు మరికొందరు. రాజులాంటి విప్లవయోధులకు చావు బ్రతుకులేమిటీ? అంటాడు రచయిత. ప్రతిఆంధ్రుడూ చదవాల్సిన నవల. ఇందులో మీరు రాజు–వాస్తవిక జీవితాన్ని చూస్తారు.

ఖైదీ : ఇది ముఖ్యంగా కష్టజీవులంతా చదవాల్సిందే.

రచయిత : పడాల రామారావు.

ప్రజాసాహితి,

జాంపేట : రాజమండ్రి.



మా తొలిప్రచురణ "సందేశం" (నాటకం) అమ్మకానికి సిద్ధంగావుంది. వెల : 1—4—0

అవంతీ ప్రెస్, రాజమండ్రి